# మహాత్ముఁడు

రచన:


విద్వాన్: దండిపల్లి వేంకటసుబ్బాశాస్త్రి

ఆంధ్రాధ్యాపకులు,

ఉస్మానియా కళాశాల, కర్నూలు



పబ్లిషర్స్:

బాలసరస్వతి బుక్ డిపో

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ (Regd)

కర్నూలు :: మద్రాసు


 1950 [వెల 1-0-0.

# విజ్ఞప్తి

నేడు విచిత్రపరిణామములతో, మారణాయుధ విజ్ఞానముతో ముందునకుఁబోవుచున్న ప్రపంచవ్యవస్థను వినాశమునుండి రక్షించుటకు మహాత్ముని మార్గమే శరణ్యము. అట్టి మహాత్మాగాంధి జీవితచరిత్రము, నాయన గుణగణములలోని విశిష్టత, సిద్ధాంతములు భావిభారతపౌరులు కానున్న విద్యార్థు లెఱుఁగుట చాల యవసరము.

ఈ గ్రంథము మహాత్ముని జీవితము, నాయన యాశయములు విద్యార్థులు సంగ్రహముగఁ దెలిసికొనుటకు దోడ్పడునట్లు వ్రాసితిని. మహాత్ముని జీవితములోని ప్రధాన సంఘటన లిందు చేర్పఁబడినవి. కొంతవఱకు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర కూడ విద్యార్థుల కెఱుక యగునట్లు చేయఁ బ్రయత్నించితిని.

ప్రభుత్వ విద్యాశాఖవారు, సోదరోపాధ్యాయ బృందము నా కృషికిఁ దోడ్పడవలసినదిగా వేఁడికోలు.

ఇట్లు,
రచయిత.

# విషయసూచిక

## ప్రథమ భాగము

పుట.



## ద్వితీయ భాగము :

# మహాత్మ్యము

శ్రీల కాలవాలమైన భారతదేశము. ప్రత్యేక సంస్కృతి, విజ్ఞానము, నాగరకతలు కలిగి ప్రపంచదృష్టి నేనాఁడో యాకర్షింపఁగలిగినది. ఆధ్యాత్మిక రంగములో భారతదేశమునదె ముందడుగు. కళాజగత్తులో సముచిత స్థానము నాక్రమించినది. ఒకనాఁడు వీరరసాతిరేకముతో నుఱ్ఱూఁతలూఁగిన పౌరుషపుగడ్డ. న్యాయధర్మము లందు పందెములు వైచుకొన్నది. భూతదయకుఁ బెట్టినది పేరు. మానవ నాగరకత, లేదా సభ్యత ప్రారంభమైన తొలి కాలమునుండి చరిత్రమును సృష్టించుకొన్న ధన్యభూమి. రానురాను కారణపరంపరచే విభిన్నప్రాంతములుగను, విభిన్న భాషా విభాగములుగను, విభిన్న సంస్కృతులకుఁ దావలముగను ప్రత్యేకతను సంపాదించుకొన్నది. అట్టి ప్రాంతములలో గుజరాతుకూడ నొకటి.

బొంబాయి రాజధాని గుజరాతు, మహారాష్ట్రము, కన్నడములకుఁ త్రివేణీ సంగమమువంటిది. గుజరాతీయులు మహైశ్వర్యవంతులు. భారతదేశమంతయు వ్యాపారము లొనర్చుచుఁ బ్రాఁకిన, ధనికజాతి గుజరాతుజాతి. దీనికే సౌరాష్ట్రమనియుఁ బేరు. సంస్కృతములోని ఘూర్జరము గూడ నిదియె. చాలవఱకు నిసుక యెడారులు. కొంత

సముద్రప్రాంతము. అక్బరునకు ముందునుండియుఁ జరిత్ర కలిగి, స్వచ్ఛందప్రియజాతీయజీవనముతో వెల్లివిరిసెను. వీర పౌరుషములు తాండవించినవి. అట్టి గుజరాతుకుఁ జెందిన యొకానొక సంస్థానమె రాజకోట. దానికి 120 మైళ్ళ దూరమున 'పోరుబందరు' గలదు. అందు 1869 వ సంవత్సరములో 'అక్టోబరు' నెల 2 వ తేదిని ప్రపంచాదర్శ పురుషుఁడు, జాతీయ స్వాతంత్ర్య ప్రదాత, శాంతిదూత యయిన మోహనదాసు కరంచందు గాంధి జన్మించెను.

తండ్రి, తాతలు సంస్థాన ప్రభుత్వము నతి భక్తి విశ్వాసములతోఁ గొలిచియుండిరి. తండ్రి పేరు కరంచందు గాంధి. లేదా కాబా గాంధి. తల్లి పుట్లిబాయి. కాబా గాంధి కొంతకాలము రాజకోట సంస్థాన ప్రధాన మంత్రిగ నుండెను. ఆమె కాబాగాంధి నాలుగవ భార్య. అంతకు ముందున్న ముగ్గురు భార్యలును గతించుటచే నామెను వివాహమాడెను. తండ్రి యవినీతిపరుఁడుగాక ధనార్జన కేపాటి ప్రయత్నముఁ జేయక తనపుత్రుల కేకొద్ది యాస్తినో వదలిపోయెను. తల్లి మతారాధకురాలు. తపస్వినివంటిది. ఎప్పుడును దేవాలయములకు వెళ్ళి దైవములను గొల్చుట, మతసంబంధపు కార్యము లొనర్చుట, యుపవాసములు చేయుచుండుట యామె పరిపాటి.

తల్లి ప్రభావము మోహనదాసుగాంధిలో నెక్కువగఁ బనిచేసెను. ఆమె చాతుర్మాస్య వ్రతములో దినము వదలి దిన ముపవాస మొనర్చుచుండెను. మఱియొక సంవత్సరము

చాతుర్మాస్య వ్రతములో సూర్యుఁడగుపించువఱకు భోజనమె చేయఁగూడదని నిశ్చయించుకొన్నది. అపుడు మోహన దాసు మొదలగు పిల్లలాకాశమువంకఁ జూచుచు సూర్యుఁడు పొడిచినంతనె యామెకు తెలుపువారు. అప్పుడామె భుజిం చెడిది. వర్షాకాలములో సూర్యుని మొగ మొక్కొకమాఱు కనిపించునదికాదు. వారికి కనిపించుటతోడనే యామెకుఁ జెప్పువారు. ఆమె వెళ్ళి చూచునప్పటికిఁ గనిపించకపోయిన నాఁడు భోజనమేలేదు. ఆమె చింతింపక "నేఁడు భగవం తుఁడు నేను భుజించుట కిష్టపడుటలేదు. పోనిమ్మ"ని చెప్పెడెది. ఆమెలోని యీ యాధ్యాత్మిక, భక్తిభావములు మోహన దాసు నెంతో యాకర్షించినవి.

పూవు, మొగ్గ తోడుగఁగనే వాసన విరజిమ్మునన్నట్లు మోహనుదాసు తన చిన్నతనమునుండియు నే విషయము నైన హృదయమునకుఁ గొనువాఁడు. చిన్నతనములో సహజ మానవులకట్టి చొరవ దుర్లభము. ప్రాథమిక పాఠ శాలలోఁ జదువు దినములలోనే శ్రావణ పితృభక్తి నాటకము చదివెను, హరిశ్చంద్రనాటకమునుఁ గాంచెను. మొదటిది తల్లి దండ్రులపై నపారప్రేమను, సేవానిరతిని ప్రదర్శించునది. రెండవది సత్యదీక్షా పరిపూతము. ఆ రెండు నాయనను నెక్కువగ నాకర్షించుటయె గాక, జీవితాదర్శములు కాఁగలిగినవి. ఇంటిలో ననుదినము జరుగు రామాయణ పఠనము మఱియొక యాకర్షణ. బాల్యములో దయ్యము లన్న నమితభయము. ఆభయముఁ దీర్చుకొనుటకై యాతఁడు

"రామనామ" మొనర్చుటకు, దానితో ధైర్యముగ నుండఁ గలుగుటకు నలవాటుపడెను. ఆ యలవాటు జీవితాంతము వఱకు నొక ప్రభావముగ నాయనపై పనిఁజేసెను.

తండ్రి యెంతటి సరసుఁడో తెల్పుట కొక్క నిదర్శనముచాలును. వివిధ మతప్రచారకులను గౌరవించువాఁడు. ఉద్యోగము చేతనేమి, సచ్ఛీలము చేతనేమి సకలమతారాధకులు నాయనను దర్శించుటకు వచ్చుచుండిరి. జైనాచార్యులు, ముస్లిము, పార్సిమత ప్రచారకులు వచ్చి యాయనతో గంటలతరబడి మతచర్చ చేయుచుండిరి. అప్పుడు శ్రద్ధగ మోహనదాసు వినుచుండువాఁడు. తత్కారణముగ నాయనతో నితరమత సహనమేకాక, అదియే మన సర్వమతములు నీతియను ముఖ్యసూత్రమునే యాధారముగఁ బెట్టుకొన్నవని, యా సత్యమే నీతికి మూలాధారమని యొక సిద్ధాంతమునకే రాఁగలిగెను.

మోహనదాసున కేడవ యేటనే తండ్రి పోరుబందరును వదలి రాజస్థానాస్థానములోఁ బ్రవేశింప రాజకోటకు వెడలెను. అచ్చట ప్రాథమిక పాఠశాలలోఁ జేర్పింపఁబడెను. ఎక్కడను జెప్పుకొనఁ దగిన విద్యాభ్యాసము లేదు. మొదటినుండియు మాంద్యపు విద్యార్థి. ఆ పాఠశాలనుండి క్రమముగ పండ్రెండవ యేడు వచ్చుసరికి నున్నతపాఠశాలఁ బ్రవేశించినాఁడు. అంతవఱకు తనతోటి విద్యార్థులతోఁ గాని యుపాధ్యాయులతోగాని యబద్ధము చెప్పుట యెఱుఁగఁడు. చాల సిగ్గుతో నితరులఁ జేరకుండెను. స్నేహితులతో

సూటిగ పాఠశాల కరుగుట—పాఠశాల వదలఁగనే యిల్లు చేరుట నిత్యము నలవాటుగా నేర్పడినది. అందులకె వెనుకఁ బడినట్లుండెను. ఎవ్వరితోడను మాట్లాడుట లేదు—ఇతరులు తన్ను పలుకరించిన పాపాన పోలేదు.

ఒకమాఱు పాఠశాలలో నుపాధ్యాయుఁడు తప్పుడు పని చేయింపఁబోయినను గాంధి నిరాకరించెను. అంత మాత్రమున నుపాధ్యాయునిపై గౌరవ మాతనికిఁ దగ్గలేదు. ఆయన పెద్దల దోషముల విషయములో గ్రుడ్డివాఁడు. పెద్దల యాజ్ఞలను బాలించుటకె నేర్చుకొనెను గాని, వారిచర్యలను నిరసించుటకు నేర్చుకొనలేదు. అనుదినము పాఠశాలకు సంబంధించిన గ్రంథములను, బాఠములను మాత్రమె చదువు వాఁడు. ఇతరము తెలియఁగఁడు. కాలమంతయు దానికె సరి పోయెడిది. ఇట్లుండ తండ్రి కొని తెచ్చిన శ్రావణ పితృభక్తి నాటకము కంటఁబడియెను దాని ప్రభావము హృదయ ములో హత్తుకొన్నది.

ఎంత మొద్దుగనున్నను విద్యార్థులలో నధముఁడుగ నుపాధ్యాయులచేఁ బరిగణింపఁబడలేదు. యోగ్యతాపత్ర ములు, ప్రవర్తన, మొదలగువాని యభ్యుదయమును గుఱించి తండ్రికి యప్పుడప్పుడు తెలుపుచుండిరి. అందు నెన్నఁడును వెనుకఁబడలేదు. కొన్ని బహుమతులు గూడ వచ్చినవి. తరువాత యుచిత విద్యావేతనములు గూడ లభించెను. వానికి శక్తి సామర్థ్యములకంటె నదృష్టమే ముఖ్యమని తలంచినాఁడు, ఆయన శక్తిసామర్థ్యములలోఁ

దన కేమాత్రము నమ్మికుండెడిది కాదు. అదియె గొప్పవారి లక్షణము. చేసిన తప్పులలో మొదటిది సరియైన చేవ్రాతకై ప్రయత్నించకుండుట, శరీరపుష్టి నొసఁగు వ్యాయామ విద్యపై నసహ్యమును బెంపొందించుకొని, గర్హించుట.

నాలుగవ తరగతిలో నింగ్లీషు బోధనా ప్రధానభాష యయ్యెను. సముద్ర మధ్యములోఁ బడినట్లు తోఁచినది. దానికిఁ దోడు క్షేత్రగణితము. అసలే యా విభాగమర్థము కాదు. దానికితోడు ఇంగ్లీషులో బోధన. ఉపాధ్యాయుఁ డెంత సమర్థుఁడుగ నున్న నాయన కర్థముగాకుండెడిది. దాని లోతు పాతు లెఱిఁగిన పిమ్మట, సులభముగఁ దోఁచుటయెకాక, యభిమానపాత్ర మయ్యెను. తరువాత సంస్కృతము. దీనికి కంఠస్థము చేయుట బాధ, ఇది చాల గడ్డు సమస్యగ పరిణ మించినది, పార్శి సులభమని యాతరగతికి వెళ్ళి కూర్చొ నెను. అపుడా సంస్కృత పండితుఁడగు కృష్ణ శంకరపాండ్య మోహనదాసునిఁ బిలిచి "నీవు వైష్ణవుని కుమారుఁడ వను మాటెట్లు మాఱచితివి? మా మత సంబంధమైన భాషనే నేర్వవా? నా సామర్థ్య మంతయు వినియోగించి మీకు సంస్కృతము నేర్పఁ దలపెట్టితిని. చదువుకొన్న కొలఁది యభిరుచి పుట్టును. ధైర్యమును విడనాడక నాతరగతికి రమ్మ"ని పిలిచెను. ఉపాధ్యాయుని మాట కాదనఁజాలక పోయినాఁడు. నాఁడు నేర్చుకొన్న కొద్దిపాటి సంస్కృతమే రాకున్న మన పవిత్రగ్రంథము లర్థమయ్యేడివి కావని గుర్తించి నాఁడు. సంస్కృతములో మంచి పాటవము సంపాదింప

లేకున్నను విద్యార్థులు తప్పక యాభాష నభ్యసించియె తీరవలె నను నమ్మకమునకు వచ్చెను. ఆయన దృష్టిలో నున్నత విద్యావిధానమందు మాతృభాష బోధనా ప్రధాన భాషగ నుండవలెనని. పరాయి భాషలో విద్య నేర్చుటలేకున్న నిన్ని భాషలు నేర్చుట కష్టముకాదని యాయనతలంపు. ఒక భాషలో సర్వసమృద్ధ దృక్పథముతోఁగూడిన విజ్ఞానముండిన నితరభాషలు నేర్చుట సులభమే యని ఆయన నమ్మెను.

౨

ఉన్నతపాఠశాలలోఁ జదువుచున్నను, బదుమూఁడవ యేట కస్తూరిబాయిని వివాహముఁ జేసికొనవలసివచ్చెను. ఆయనతో సమానమైన వయస్సుగల వారందఱు నాశ్చర్య చకితులైరి. వివాహముగాని వారలఁజూచి గాంధి సంతోష పడుచుండెను. బాల్యవివాహము లేమార్గమునుబట్టియు సమర్థింపఁజాలమనియు, హిందూసంఘములో నొకవైపు విద్య నభ్యసించుచు వివాహము చేసికొనుట యలవాటైనదనియు గాంధి భావించినాఁడు.

దుస్స్నేహమువల్ల మోహనదాసు గాంధి జీవిత ములో నొక విషాదాంతగాథ జరిగినది. ఒక సహవాసి యాయన జ్యేష్ఠభ్రాతకు మిత్రుఁడు. వాళ్ళిరువురు సహాధ్యా యులు. సహవాసియొక్క లోపముల నెఱిఁగినవాఁడైనను విశ్వాసపాత్రుఁడైన మిత్రుఁ డనుకొనియె. తల్లి, పెద్దన్న, భార్యకూడ హెచ్చరించిరి. వారికి సమాధానముగ నాతని లోపముల నెఱుఁగుదుననియు, నాతనిలో మార్పు తెచ్చుటకె

ప్రయత్నించితిననియుఁ దెలిపినాఁడు. అప్పటి కాసమాధాన మునకు వారు తృప్తిపడకున్నను, మోహనదాసు మార్గ మున కడ్డుమాత్రము రాలేదు.

తరువాత గాంధి యిట్లు భావించెను. "నేను పొర పాటుగ నాలోచించితిని. సంస్కర్త యెవ్వరినైన సంస్క రింప నెంచిన వానితో నెక్కువ చనువు తగదు. హార్దిక స్నేహ మీ ప్రపంచములో చాల తక్కువగ ఘటించును. ప్రవర్తనాభిమాన పూర్వకస్నేహమే చెప్పఁకొనఁదగినది. మిత్రులొకరి ప్రభావముపై నొకరు ప్రసారితులు కావలె. స్నేహముతో సంస్కరణకుఁ గొంచెముపాటిదే యవ కాశము. అత్యంతస్నేహపద్ధతులు సరియైనవి కావు. భగ వంతునితో స్నేహముచేసిన వాఁ డేకాంతముగనైన నుండ వలె — లేదా, ప్రపంచమునే మైత్రి గావించుకొనవలె. హార్దికస్నేహము కలిగించుకొనవలె ననుకొన్న నాది పొర పాటె కావచ్చు. కాని, నా ప్రయత్నము నెగ్గలేదు." అని యెను. సంస్కరణమను ఝంఝూవాతము రాజకోటలో వీచునప్పు డావ్యక్తితో స్నేహము. వాఁడు చాలమంది యుపా ధ్యాయులు రహస్యముగ మాంసము తిందురు — మద్యము సేవింతురు. రాజకోటలోఁగల పేరెన్నికఁగన్న యింక కొంద ఱట్టివారే. ఉన్నతపాఠశాల విద్యార్థులునుగల'రని చెప్పెను. 'ఎందు'కని గాంధి యాశ్చర్యముతో నడిగెను.

ఆ సహవాసి "మనము మాంసము తిననందుననే వెనుకఁబడినవారము. ఆంగ్లేయులు మాంసాహారులు కాఁబ

ట్రియే మనపై ప్రభుత్వము చేయుచున్నారు. నేనెంత దృఢముగనుంటినో, యెంత చక్కఁగ పరుగెత్తఁగలనో నీకుఁ దెలియుఁ గదా! మన యుపాధ్యాయులు, తదితర ప్రముఖులు మాంసాహారులైనారన్న తెలివితక్కువవారా? దాని గొప్పతనముఁ దెలిసికొనిరి. నీ వట్లుచేయుము. ఒక్కమారు ప్రయత్నించి దాని బలమెట్టిదో గమనింపుము." ఈ మాటలన్నియు నప్పుడప్పుడు చెప్పుచుండినవి. మోహనదాసు పెద్దన్న యేనాఁడో పై మాటలకు లోఁబడెను.

మోహనదాసు మనస్సులో విచిత్రమైన యాందోళన చెలరేఁగెను. సహవాసి—పెద్దన్నల శరీరపాటవము, శ్రమకోర్చుకొనఁగల శక్తి మిక్కిలి యాకర్షించెను. తనలోఁ గలిగిన భావపరివర్తనముఁ బ్రక్కనున్న భార్య కెట్లు చెప్పఁ గలఁడు? వారిద్వరు యౌవనద్వారబంధము కడ నుండిరి. అప్పుడాయనలో మాంసాహారముపై నభిమానము కలిగెను. మాంసాహారము మంచిదనియు, దానిచే దృఢమగుటయె కాక, ధైర్యముగూడ లభించుననియు, దేశమంతయు నందుల కొడంబడిన నాంగ్లేయులఁ దరిమివేయవచ్చుననియు సంకల్పము లంకురించినవి. ఒక దినము నిర్ధరించెను. తల్లిదండ్రులు వైష్ణవులు కాఁబట్టి వారి కంటఁబడకుండ రహస్యముగ జరుగవలెను. తెలిసినదా, మహాదుఃఖసాగరములో మునుఁగుదురు. సత్యముపై నాయనకున్న ప్రేమ మఱియు జాగ్రత్తపఱచెను. తల్లిదండ్రులను మభ్యపెట్టుచున్నానని దలఁపఁడాయె. సంస్కరణపైనని బుద్ధి, దేశ

ప్రజలందఱు మాంసాహారులైన నాంగ్లేయుల నోడించి, దేశ మును స్వతంత్ర మొందింపవచ్చు. ఆనాఁటికి గాంధి స్వరాజ్య మను పదము వినలేదు. కాని స్వతంత్ర మన నేమియో యెఱుఁగును. సంస్కరణపు తలతిక్క యతని గ్రుడ్డివానిఁ గావించెను. గుట్టుగ జరుపుటచేత, తల్లిదండ్రులను మభ్య పఱచుట యనునది సత్యమునుండి దిగజాఱుటగ గమనింపఁ జాలఁడయ్యె.

ఆరోజు వచ్చినది. ఆయవస్థ వివరింప శక్యముగాదు. సంస్కరణపు నుబలాట మొకవంక—జీవితములోఁ గ్రొత్త దైన విశేషత్వ మొకవంక. ఏదిచేయుట యందు దాస త్వముఁ దో దానికి దొంగవలె లజ్జను బ్రదర్శించుట. వీని ఘర్షణముల మధ్య నొక నదీప్రాంతమున నేకాంతస్థలముఁ జేరుకొనెను. మొదటిసారి మాంసముఁ గాంచినాఁడు. ప్రయాసతోఁ జవి చూచెను—గొఱ్ఱె మాంసము కొంత. రాత్రికి నిదురపట్ట లేదు. ప్రతిక్షణము జాగరూకతయె! బ్రతికిన గొఱ్ఱెమ నసులో మెదలుచు విశారము కలిగించుచుండెను. మరల మాంసాహా రావశ్యత జ్ఞాపకమునకు వచ్చినది.

మెల్లఁగ మాంసాహారమున కలవాటు పడెను. సహ వాసి పలురకములుగ మాంసమును వండి, శుభ్రముగఁ బెట్టువాఁడు. నదిలో నేకాంత ప్రదేశమునకు వెళ్ళుట మాని, యొకానొక ప్రభుత్వ భవనములో నా వంటవానిచేఁ జేయించుకొన మొదలిడిరి; చాల ధనవ్యయముతోఁ గూడిన పని. అందుచే సంవత్సరములో నాలుమార్లు కెన్న నెక్కు

వగఁ దినలేరైరి. సహవాసి యవసరమైన ధనము నెక్క-డనో సంపాదించి పని జరుపువాఁడు. మాంసము తిన్ననాఁడు మోహనదాసు నింటిలో నాహారము సహజముగ స్వీకరింపఁ జాలఁడాయె. తల్లి ప్రశ్నించెడిది. "సరిగ జీర్ణము కానందున నాఁకలి" లేదనుచుండెను. తల్లితో నబద్ధమాడుచున్నా నని యెఱుఁగును. తల్లిదండ్రులు మాంసాహారము విషయము విన్న బాధపడు ననియుఁ దెలుసు. అది హృదయములోఁ గలవరపెట్టసాగెను. "మాంసాహారము ముఖ్యమైనను, దేశములో నాహారమందు సంస్కరణమె తీసుకరావలెను గాని, తల్లిదండ్రులను మోసపుచ్చుట మాంసాహారమునకన్న నీచము. వాళ్ళు బ్రతికియుండ నాపని చేయఁగూడదు. వారి యనంతరము స్వతంత్రుఁడనై బహిరంగముగనె మాంసముఁ దినవచ్చు. అంతవఱకు నేను దినగూడ" దను నిశ్చయమునకు మోహనదాసు వచ్చెను. తన నిర్ణయము సహవాసికిఁ దెలిపినాఁడు. నాఁటినుండి మాంసము ముట్టలేదు. ఇద్దఱు పుత్రులు మాంసాహారులగుట తల్లిదండ్రు లెఱుఁగఁ జాలరైరి.

మాంసముఁ దినుట తల్లిదండ్రులతో నబద్ధమాడ లేక వదలెను గాని, సహవాసిని వదలఁ జాలఁడయ్యె. వాని సంస్కరించు ప్రయత్నము తనకె ముప్పు చేకూర్చినది. వాఁడె తన భార్యపై విశ్వాసము పోవునట్లు చేయఁబూనుకొనెను. దేవుఁడా బాఱినుండి రక్షించినాఁడు. అప్పటికిని కనువిప్పు కాలేదు, అనుమానముచేత భార్య కెంతయొ బాధ

కలిగించెను. ఆయనలోని యీ యనుమానము పోవుటకు నహింస నర్థము చేసికొనుట, బ్రహ్మచర్యములోని రహస్య మెఱుఁగుటయే ముఖ్యకారణములైనవి. అప్పుడె భర్తకు భార్య బానిసకాదని, సహచారిణి యనియు, సుఖ దుఃఖము లలో భాగస్వామిని యనియు, భర్తవలె తన కిచ్చ వచ్చిన విధాన మవలంబించుట కామెయు స్వతంత్రురాలని యెఱిఁగెను. సహవాసిపై నంతదాక నున్న గ్రుడ్డి నమ్మకము పోయినది.

ఒక బంధువుతో సహా, మోహనదాసునకు పొగ త్రాగవలెనను వాంఛ పొడమినది. అందులోని మంచికని గాని, బీడివాసనకుగాని కాదు. ఒకవిధమైన వేడుకకె! మామ కా యలవాటున్నది. ఆయన ననుకరింపవలెనని. బీడీలు కొనుటకు డబ్బులేదు. ఆయన పాఱవైచినవానినే త్రాఁగుటకు మొదలిడిరి. అవి యెప్పుడును లభ్యమయ్యేడివి కావు, అయినను సరియైన పొగనిచ్చెడివికావు. బీడీలు కొనుటకై పనివాని జేబులోనుండ కాసీలను దొంగిలింప సాగిరి. పెద్దలయెదుట త్రాగుటకు వీలులేదు. అటులనే 'సిగరెట్ల'లోకి దిగి, వానిఁ బీల్చసాగిరి. వీనితోఁ దృప్తి కలుగదాయె. స్వేచ్ఛలేదను విచారము. ఆ విచార మొక్కప్పు డాత్మహత్యా నిర్ణయమునకుఁగూడ దోహద మొసఁగెను! ఆ ఘట్టమే వారు దురభ్యాసమును వదలిపెట్టు టకుఁ గారణమైనది. నాఁటినుండి మోహనదాసు పొగ పీల్చినపాపాన పోలేదు. పొగత్రాగుట పశుకృత్యమనియు,

కళ్ళలము—ప్రమాదకారణమనియుఁ దలఁచెను. అప్పటి పరిస్థితిని వ్యాఖ్యానించుచు "ప్రపంచమందంతట నీ పొగ త్రాగుడుపై నింత మురిప మేలనో నా కర్థముకాలేదు. రైలు పెట్టెలో నందఱు పొగత్రాగుచుండుట నాకు సహింపరానిది" అనెను.

ఒకపర్యాయము మోహనదాసు బంగారమునె దొంగిలించినాఁడు. దానిచే నొక నిర్ణయమునకు రాఁగలి గెను. ఇఁక నెన్నఁడు దొంగతనము చేయరాదు. తన పశ్చాత్తాపము తండ్రికిఁ దెలుప నూహించెను. ఆయనతో మాట్లాడుటకు ధైర్యమెక్కడ? ఆయన బాధపడునను చింత. తుదకు వ్రాఁతమూలకముగ తనతప్పు తెలిపి మన్నింపఁ గోరుచు, తగినశిక్ష విధింపమని ప్రార్థించెను. కాబాగాంధి మంచములోఁ బడియుండిఁగ మోహనదాసుఁ డా కాగితము నొసఁగెను. అంతయుఁ జదివి, యెడఁదపై కాగితమును బెట్టుకొని, యది తడిసిపోవునంతగ కన్నీళ్ళు కార్చెను. కొన్నిక్షణములు కన్నులు మూసికొని, చించివేయఁదలఁచి, మరల కూర్చొని చదివి, పరుండెను. ఆయనతో మోహన దాసు నేడ్చెను. "నేనె చిత్రకారుఁడనైన యూనాఁటి చిత్ర మున్లె వ్రాయువాఁడ. అది నా మెదడులో నిప్పటికిఁ గదలాడు చున్న"దని గాంధి వివరించినాఁడు,

ఆ కన్నీళ్లే హృదయమును పరిశుభ్రమొనర్చి, లజ్జను కడగివైచినవి. అట్టి ప్రేమతో ననుభవముగలవారు మాత్రమే దానిఁ దెలిసికొన సమర్థులు. మోహనదాసు తన

సామాన్య జీవనములో జరిగిన సంఘటనలనుండియె మహోత్తమాదర్శములఁ గాంచెను. ఆ ఘటనలో మూర్తీభవించిన యహింసాప్రభావ మాయన భావనా జగత్తును మేలుకొలిపెను. అహింసయొక్క శక్తి కంతులేదనుకొనెను. తన తప్పును దెలిసికొనుటతోడనె తండ్రి మండిపడుననియు మోహనదాసు తలఁచెను. అట్టిది జరుగదాయె. విచిత్రమగు శాంతిని తండ్రి ప్రదర్శించుటచేఁ దనదోష మొప్పుకొనుటలోఁ గల వివేకము కారణముగ భావించినాఁడేమోనని యాచించినాఁడు. తన పశ్చాత్తాపము తండ్రి కెక్కువ విశ్వాసకారణమైన ట్లర్థము చేసికొనెను. నాఁటినుండి కాబగాంధి పుత్రునిపై నధికానురాగము గలిగి యుండెను. మోహనదాసుకుఁ బదునాఱవ యేటనే పితృవియోగము సంప్రాప్తించెను.

కస్తూరిబాయి కొన్నినెలలు తక్కువగ మోహనదాసుతో సమానమైనట్టి వయస్కురాలు. తన చిన్ననాఁటి వివాహమును గుఱించి "నా దృష్టిలో నాఁడు వివాహమన్న మఱి యితరమైన గొప్ప యేమిలేదు. నూత్నవస్త్రధారణము, మంగళవాద్యముల ఘోష, పెండ్లి యూరేగింపులు, మంచి విందులు, నాడుకొనుట కొక క్రొత్తయమ్మాయి" అని వివరించెను. మొగమోటము విడిచి గాంధియే చెప్పియుండెను. భార్యపై భర్తకుఁగల యధికారముల నన్నింటిని నడిపినాఁడు. అనేక నిర్బంధములఁ బెట్టి, యొకప్పుడు చాల నసూయనుగూడ ప్రదర్శించెను. ఆ స్వతంత్రురాలు వాని కన్నింటికిఁ దలయొగ్గి, సందర్భాను

సారముగఁ బ్రవర్తించెడిది. వివిధసాంస్కృతికాభిప్రాయ భేదము లడ్డువచ్చినను కలిసిమెలసి సుఖదాంపత్యమును కొనసాగించిరి.

జీవితములోని విభిన్నత లాయన కొంటఁ బట్టినవి. ఆయన యాధ్యాత్మిక ప్రమాణముకూడ సహవాస, శ్రవణములచేత దినదినాభివృద్ధిఁ గాంచఁదొడఁగినది. హిందూమత వివిధసాంప్రదాయములపైనను, సోదరమత సిద్ధాంతములపైన నభిమానము గాఢతరము కాఁజొచ్చెను. ఆయన తల్లిదండ్రు లెన్నఁడైనను వైష్ణవ శివాలయములకు వెళ్ళునప్పుడు పిల్లలను బిలుచుకపోయెడివారు. ఆ దేవాలయములు బాలురకు నుత్సాహరంగములు గదా! దానిచే నొకవిధమైన మూర్తిపూజాభక్తి, తీర్థప్రసాదులయం దనురక్తి యేర్పడెను. కొన్నిదినములకు దేవాలయ దేవసందర్శనము నిత్యకృత్యమయ్యెను. కాబాగాంధి చెంత కన్నిమతములకుఁ జెందినవారును వచ్చుచుందురని యిదివరకే తెలిసికొంటిమి. ఆయనకు శుశ్రూషచేయుచుండుటచే నవి మోహనదాసు చక్కఁగ గమనించువాఁడు. ఆ కారణముచేతనే యన్నిమతములపై నభిమానము కలిగెను. ఈ మాత్రముచేతనే యాయనకు దేవునిపై నభిమానమని కాదు. నీతిపై యాధారపడినదే మతము. సత్యము నీతుల యొక్క సారము. అందువల్ల నాయన లక్ష్యమంతయు సత్యమేయైనది. అది నానాఁటికి బలపడుటయేకాక, దాని పరిధికూడ విశాలమగుచుండెను.

1887 సం॥లో 'మెట్రిక్యులేషన్' పరీక్షలో నుత్తీర్ణుఁడైనాఁడు. ఆ రోజులలో బొంబాయి, అహమ్మదాబాదులలో మాత్రమే పరీక్షా కేంద్రము లుండెడివి. సాధారణ దరిద్రులైన కథియవాడ విద్యార్థులు సమీపము, చౌక రకముగనుండు కేంద్రమునె కోరుకొనువారు. మోహనదాసు కుటుంబము దరిద్రత కదియె శరణ్యము. తోడెవ్వరును లేకుండ మోహనదాసు చేసిన తొలిప్రయాణ మదియె. పెద్దలు కళాశాల విద్యాభ్యాసముఁ జేయఁగోరిరి. బొంబాయి—భావనగరములలోఁ గళాశాల లుండినవి. భావనగరమున వ్యయము తక్కువని గాంధి యచటి శ్యామలదాసు కళాశాలలోఁ జేరెను. అక్కడంతయు నగమ్యగోచరమే. ఎందులో నభిరుచి కలుగలేదు. ఉపన్యాసకు లాచార్యులు మొదట తరగతికిఁ జెందినవారు. వారిలో నే లోపము లేదు. మూఁడు మాసములు గడచిన పిమ్మట తిరిగివచ్చెను.

మావ్జీదావె యను బ్రాహ్మణుఁడు వారి యింటికి హితుఁడు—సలహాదారుఁడు. పుట్లిబాయి కాయన చాల వఱకు, నచ్చచెప్పి గాంధిని 'ఇంగ్లండుకు' పంపవలసిన దనియు, మూఁడు సంవత్సరములలో 'బారిష్టరై' తిరిగి రాఁగలఁడనియు భోధించెను. గాంధినిగూడ ప్రశ్నింప కళాశాలలో విద్యాభ్యాసము కష్టముగనున్నదని బాధపడుచుండుటచే నందుల కంగీకరించినాఁడు. అన్న కింతటి పిన్నవానినితర దేశములకుఁ బంపుట యెటులనా యని సందేహము తల్లి వదలియుండుటకె యిచ్ఛగించుటలేదు. ఆమె కొన్ని

రొక్కొక్క విధమైన యనుమానములు చెప్పిరి. మాంసము, మధుపానముల గురించి బెంగతో కుమారుని "వీని విషయ మెట్లు?" అని ప్రశ్నించినది. అందులకు గాంధి "నా మాట నమ్ముము. నే నబద్ధమాడను. వాని నన్నింటిని ముట్టను." అనగా "నే నిక్కడి సహజపరిస్థితులలో నిన్ను నమ్ముదా నని. దూరమునగనుండు నిన్ను నమ్ముటెట్లు? ఏమి చేయ వలెను తోఁచకున్నది. బేచార్జిస్వామి నడుగుదు" ననెను. అతఁడొక జైనుఁడు. గాంధి యింటికి సలహాదారుఁడు. ఆయన గాంధి కనుకూలముగా "మూఁడు ప్రమాణములు చేసినట్లైన నీ బాలుని పోనీయవచ్చు"నని సెలవిచ్చినాఁడు. గాంధి యంగీకరింప మద్యము, మాంసము, స్త్రీలను ముట్టనను మూఁడు ప్రమాణముల నాయనతోఁ జేయించుటచే పుట్లీ బాయి యంగీకరించెను. ఉన్నతపాఠశాల 'ఇంగ్లండు' పోవుచున్న మోహనదాసునకు బ్రహ్మాండమైన వీడ్కో లొసంగెను. అంతవఱకు, రాజకోట చరిత్రలో నది యసా ధారణ ఘట్టము. 'ఇంగ్లండుకు' యువకుఁడు ప్రయాణమై పోవుట యదియె మొదటిసారి. తనకు వీడ్కో లొసంగిన వారల కందఱకు ధన్యవాదములు సమర్పించి, తల్లి, యన్నల, తదితర ముఖ్యుల యాశీర్వాదముఁ బడసి మోహనదాసు గాంధి 'బారిష్టరు' పట్టమునందుటకై 'ఇంగ్లండుకు' బయలుదేఱి వెళ్ళెను. ఒక్కక్షణమైనఁ గొడుకును వదలి యుండఁజాలని వాత్సల్యహృదయ యా పుట్లీబాయి దశ యెట్లుండునో యూహింపుఁడు!

## 3

కాబాగాంధి చనిపోయి రెండు సంవత్సరములు మాత్రమే యయినది. వైధవ్య మనుభవించు తల్లి, సంసారము నీదుచు కష్టపడుచున్న యన్న తమ సనాతన పద్ధతుల కన్నింటికి స్వస్తి చెప్పి కుటుంబార్థిక స్థితుగతులను సైతము లెక్క చేయక మోహనదాసును 'ఇంగ్లండుకు' పంప నిశ్చయించిరి.

1888 సం. సెప్టంబరు 4 వ. తేది బొంబాయిలో నోడ నెక్కెను. సముద్రప్రయానము వల్ల మామూలుగ నందఱకు వచ్చు జబ్బుకు గురి కాలేదు. దినములు గడచుకొలది బిడియ మధికము కాసాగెను. ఎవ్వరితోడ మాట్లాడువాఁడు కాఁడు. ఇంగ్లీషు మాట్లాడు నలవాటు లేదు. ఒక్క మజుందారు తప్ప నందఱు నాంగ్లేయులే! వాఁడెప్పుడైన మాట్లాడుటకు వచ్చిన నిదానముగ మాట లర్థము చేసికొనుచుండెను గాని, సమాధానము చెప్పఁడాయె. మాట్లాడుటకు ముందు ప్రతివాక్యము ముందాలోచించి పెట్టుకొన్నఁ గాని బయటికి పలుకలేఁడు. ఆ భోజన సాధనము లెన్నడు నుపయోగించ లేదు. ప్రతి పదార్థమందును మాంస మున్నద, లేదా యని విచారించును. కొన్ని తినుబండారము లింటినుండియె తెచ్చుకున్నాఁడు. గాంధి యెవ్వరితోడఁ గలసి మెలసి యుండకుండుటను జూచి, సోదర ప్రయాణికులతో సంభాషించు ఘ్నని మజుందారు ప్రోత్సహించువాఁడు. న్యాయవాదులకు దీర్ఘ సంభాషణ శక్తి కావలెననియు, నవకాశ మున్నప్పు

డెల్ల నింగ్లీషులో మాట్లాడవలె ననియు బోధించుచుండెను. పరభాష మాట్లాడుచోఁ దప్పులకు లెక్క పెట్ట వద్దని తెలిపెను. పై మాటల వల్ల గాంధి బిడియ మెంతమాత్రము తొలఁగదాయె.

ఎట్టి సముద్రమునఁ బ్రయాణము చేయుచున్నప్పుడొక ఆంగ్లేయుఁడు గాంధితో మాట్లాడుచు నాతని నియమముల నెఱిఁగెను. "ఇప్పు డేమియు బాధలేదు. 'బిస్కే' ఖాతముఁ జేరినప్పు డివి పనికిరావు. అత్యంత శీతలమైన 'ఇంగ్లాండులో' మాంసము తినకుండుట యసంగతము" అనెను. మాంసము భక్షింపకయె జీవించువా రచటలేరా యని గాంధి ప్రశ్నింప "నంతయు నబద్ధము, ఒక్కఁడుగూడ లేఁడు. నీవుగూడ నందు కొడంబడక తప్ప"దని ప్రత్యుత్తర మొసఁగెను. గాంధి తన ప్రమాణము విషయ మెఱుకపఱచెను. 'బిస్కే 'ఖాతము వచ్చెను మోహనదాసున కట్టి యవసరము కలుగలేదు.

'సౌతాంప్టన్'లో దిగినాఁడు. నాల్గు పరిచయపుటుత్తరము లుండినవి. అవి డా. పి. జె. మెహతా, దలపత్రాం శుక్లా, రాజా రంజిత్ సిన్హ్జి, దాదాభాయి నౌరోజి యిచ్చినవి. 'విక్టోరియా హోటలు'లో బసచేయ మని యెవరో చెప్పిరి. మజుందారుతోఁ గలిసి వెళ్ళినాఁడు. తన తెల్లని దుస్తులవేషము చూపఱ కాశ్చర్యముఁ గలిగించెను.

డా. మెహతాకు గాంధి తంతి నిచ్చుటచే నాయన 8 గం. లకు వచ్చి చూచెను. హృదయపూర్వక స్వాగత

మొసఁగినాఁడు. ఆయన 'టోపి' యెంత నునుపుగ నున్నదో చూడఁ జేతికిఁ దీసికొని తడివెను. దానితో సుకుమారమైన యా 'టోపి' యందము చెదరినది. డా. మెహతా గాంధి నాపి, భవిష్యత్తునకు పాఠము నేర్పెను. 'ఇతరుల వస్తువులు ముట్టఁ గూడదు.' అని ఆంగ్ల సభ్యత నెఱుకపఱచెను. గాంధిజి మొదట ఇంగ్లండులో నేర్చిన గుణపాఠ మదియె.

డా. మెహతా 'హోటలులో నుండుట యధిక వ్యయ'మని చెప్పెను. ఎవరి కుటుంబముతోనైనఁ గలిసి యుండుట మంచిదన్నాఁడు. మజుందారున కోడలో నొక సింధుదేశీయుఁడు స్నేహమయ్యెను. అతనికి లండను క్రొత్త కాదు. గది నొకటి కుదిరింతు ననియెను. మోహనదాసు గాంధి, మజుందారులు సింధీయుఁడు కుదిర్చిన గదిలోఁ బ్రవేశించిరి. హోటలుకు పెద్ద మొత్తము చెల్లింపవలసి వచ్చెను. అందుచే గాంధి కొన్నా ళ్ళుపవాసము చేయవలసి నవాఁడాయె! ఆగదులు సైతము గాంధికి శాంతిని ప్రసా దింపలేక పోయినవి. ఇంటిమీఁద, మాతృదేశముపైనని చింత. మాతృవాత్సల్య మతనిని బాధపెట్టసాగినది. రాత్రుల యందు కన్నీటి ప్రవాహము చెక్కిళ్ళగార్చుచు, నింటివిషయ ములె పలుమాఱు స్మరణకువచ్చి నిద్రకుఁ దావీయలేదు. ఆ దైన్యమనుభవింప నెవరితరము? అంతయుఁ గ్రొత్తమె! ప్రజలు—వారి విధానాలు—వారి నివాసముఁ గ్రొత్తనే! మాంసాహారము చేయనను ప్రమాణము మఱియు బాధా జనక మాయెను. ఏవస్తువు తినఁబోయినను రుచి దొరకదు.

మనస్సులో పెద్ద విప్లవము బయలుదేఱినది. ఇంగ్లండులో వీని కన్నింటికిని సహింపలేఁడు—భారతదేశమునకుఁ దిరిగి పోవుద మన్నఁదగదు. తుదకొక నిర్ణయమునకు వచ్చినాఁడు. మూఁడు సంవత్సరములు గడిపి పోవుటయె మంచిదని యంత రాత్మ ప్రబోధించెను.

మరల డా. మెహతా కలిసికొని "నీవు 'ఇంగ్లీషు' వారి జీవితము, వారి సాంప్రదాయములు దెలిసికొనుటకు గ్రంథములపై నాధారపడి, ప్రత్యక్షానుభవముఁ బొందకున్న నిరుపయోగము. అందుల కొక కుటుంబముతోఁ గలిసియుండవలె. దానికి ముందు నేను నిన్నొకరిచెంత నిన్నుంచెద" నన గాంధి సమ్మతించెను. ఆ యాతిథేయుఁడు గాంధిని సోదరునివలెఁ జూచుచుండెను. ఇంగ్లీషు సాంప్రదాయములు నేర్పుచు, భాషగూడ మాట్లాడుచు గాంధి కెంతయో సహాయ మొనర్చువాఁడు. గాంధికది నచ్చినది. అక్కడయు నాహారపు సమస్యయే! ఆతఁ డెంతయొ మాంసాహారము మంచిదని వాదించువాఁడు. ప్రతిదిన మావాదము పరిపాటి. ఆయన వాదించుకొలది గాంధి మఱింత గట్టి పట్టుదలఁ బ్రదర్శించువాఁడు. తన వాదమును సమర్థింప గ్రంథములను సైతము తెచ్చి చదివి వినిపించెను. తుదకు గాంధి "మిత్రమా! క్షమింపుము. మాంసాహార మిచ్చుట యవసరమె. కాని, నా వాగ్దానమును నేను నిలుపుకొనవలసి యున్నది. మీతో నేను చర్చింపఁజాలను. మీ రేమైన ననుకొన్నఁడు, నా మంచికె చెప్పుచున్నారు. నేను

నిస్సహాయుండను. ప్రమాణమన్నఁ బ్రమాణమే! తప్పదు.” అన నాతఁడు విచిత్రముగఁ జూచి “నేనింక వాదించను,” అప్పటినుండి యావిషయమై యేమాత్రము వాదోపవాదములు జరుగలేదు.

అతిథేయుఁడు గాంధిని కనీసము ‘ఇంగ్లీషు’ పద్ధతులనైన నలవఱచుకొమ్మనెను. దాని కిష్టపడి భారత దేశమునకుఁ దిరిగి వెళ్లులోపల ‘ఇంగ్లీషు’ పెద్దమనిషిగఁ (Gentleman) గాఁ దలంచె. బిడియమును వదలి, శాకాహారిగనె యున్నప్పటికిని తదితరమగు నుత్తమ సాంఘిక పద్ధతులఁ బ్రేమింప మొదలు పెట్టినాఁడు. ఇంగ్లీషు సంఘమునకుఁ దగిన దుస్తులు ధరించుట. సిల్కు ‘టోపి.’ అనుదినము నద్దము చూచుకొని, వేషము సవరించుకొనుటకె యఱగంట పట్టెడిది. ఆ సంఘమునకుఁ దగినట్లుండవలె నని నాట్యము నేర్వఁదలఁచెను. కొన్ని వాయిద్యము లభ్యసింపఁ బ్రయత్నించెను. తాను వెళ్ళవలె ననుకొన్న ఫ్రెంచి దేశపు భాషయగు ఫ్రెంచినికూడ నేర్చుకొనఁగోరెను. తరువాత నతనిలో భావ పరివర్తనము గలిగెను. “జీవితమంతయు ఇంగ్లండులోఁ గడుపఁ దలఁచుకొనలేదుకదా? ఈ నాట్యమువల్లనే పెద్దమనిషి నయ్యెదన? ‘వాయిలన్’ వాద్యవిశేషము భారత దేశములోనె నేర్చుకొనవచ్చు. నేను విద్యార్థిని, విద్యాభ్యాసము కాఁగానే వెళ్ళిపోవలయు. న్యాయవాదిగ నుత్తీర్ణుఁడఁ గావలెను. నాప్రవర్తనమె పెద్దమనిషిగఁ జేసిన మంచిది – లేనియెడ నాయాసనే వదలెదను,” అనుకొన్నాఁడు,

ఆ నిర్ణయముప్రకారము మఱుసటిదినము నుండియె పూర్తిగ మాఱిపోయెను. పైకోరికలన్నియు మూఁడు నెలలో తాఱుమాఱయినవి. వేషము మాత్రము ఇంగ్లీషు సభ్యతకుఁ దార్కాణముగనే యుండెను. ఆనాఁటినుండి యతఁడొక విద్యార్థి. మఱి వేఱొక కోరిక కాయన లోఁగలేదు. లోఁగదీయు సాహసమున కెవ్వరుఁ బూనుకొనఁ జాలరైరి.

ఆర్థికభారము తగ్గించుకొన జీవితపద్ధతులను మార్చుకొనెను. అర్ధభాగము వ్యయము తగ్గెను. రాకపోకలకు వ్యయింప నక్కఱలేదు. ఇంగ్లీషుభాష ధారాళముగ రాని లోపము క్షణక్షణము కనిపించెడిది. న్యాయవాదిపట్టము మాత్రమె కాక, మఱియొకపట్టము నాంగ్లమున సంపాదించవలెనని కోరిక. అక్కడఁగల విశ్వవిద్యాలయములలోను, స్నేహితులను విచారించెను. విశ్వవిద్యాలయములోఁ బ్రవేశించుట మిక్కిలి ధనవ్యయముతోఁ గూడినది. అందఱి సలహాలపై లండన్ 'మెట్రిక్యులేషన్' పరీక్షకు వెళ్ళ నిశ్చయించుకొన్నాఁడు. అందులో 'ల్యాటిన్' భాష నిర్బంధము అది దుస్సాధ్యమని చింత. ఒక స్నేహితుఁడు 'ల్యాటిన్ న్యాయవాదుల కుపయోగకరమైనభాష. న్యాయశాస్త్రగ్రంథము లర్థముచేసికొనుట కది యెంతైన నవసరము. అదికాక 'ల్యాటిన్'లో విజ్ఞానమున్న ఇంగ్లీషు భాషపై మంచి పెత్తనముండఁగల" దనెను. ఆ వాదము గాంధికి నచ్చినది. ఆఱునెలల వ్యవధిలో లండన్ 'మెట్రిక్యులేషన్' పరీక్షకు సిద్ధమైనాఁడు. ఒక్క 'ల్యాటిన్'లో మాత్రము

తప్పెను. అందుచే నిరుత్సాహపడలేదు. ఎట్లైన నేమి తరువాత 'ల్యాటిన్' భాషపై నభిమానము హెచ్చెను. రానురాను తన యాహారమునకుఁగూడ చాల వ్యయము లేకుండఁ జేసికొని కాలము గడుపుచుండినాఁడు. పై కారణము లన్నిటిచే నాయన జీవితము సంక్షుభితము కాలేదు. నిత్యజీవితము సత్యపూర్ణమయి, మనస్సు సంతోషముస కాలవాలమైనది.

అక్కడి యనేక మతస్థులతోఁ బరిచయము సంపాదించెను. దివ్యజ్ఞాన సమాజమునకుఁ జెందిన యిద్దరు వ్యక్తులఁ గలిసికొనెను. జీవితములో మొదటిసారి భగవద్గీతను జదువ వారిచే ప్రేరేపింపఁబడినాఁడు. సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారి గీతానువాదము (ఇంగ్లీషులోకి) చదువమనిరి. అంతదాక పవిత్రగ్రంథముగ భారతదేశమునఁ బేర్కొనఁబడిన గీతను జదువకున్నందులకు సిగ్గుపడినాఁడు. కనీసము ఆంగ్లానువాదమైనఁ దెలిసికొని, తనచేత నైనంత తోడ్పాటొసంగ సమ్మతించెను. విలువకట్టరానంతటిదిగ నెంచఁగినాఁడు. దాని తోడ్పా టెంతయొ యుపయోగించినది. అప్పుడే యొక స్నేహితుఁడు 'బైబిల్' చదువఁగోరెను. చదివి గీతతోఁ బోల్చి చూచుకొనెను. అంతవఱకు హిందూమతమ్మును గుఱించి బాగుగ తెలిసికొనియున్నను జీవితపరీక్షకది చాలదనుకొనియె.

ఇక్కడనె కార్లైల్ ఫ్రెంచి విప్లవమును జదివి, కార్డినల్ మ్యానింగుతో సంభాషించినాఁడు. ఆయనవల్ల నే

సంఘసేవలో మొదటిపాఠము ప్రారంభము. ఉన్నదున్నట్లు చెప్పవలసిన బిడియము, సభాకంపము విడిచి యుపన్యాస మొసఁగినది లేదు. ఆ కష్టమే తన భావముల నడంచుకొను టకు, పదములపై సరియైన యదుపుంచు కొనుట,—ఈ యలవాటు కా జీవితాంతమువఱకు నాయన కుండినవి.

ఆ సమయములోని విద్యాభ్యాసము మఱపురానిది. తొమ్మిది నెలల విధి విరామములేని పఠనానంతరము 1891 వ. సం. జూన్ 10 వ తేది 'బారిష్టర్' పట్ట మొసంగిరి. హిందూన్యాయశాస్త్ర పరిజ్ఞానము శూన్యము. తగిన పని దొరకునో లేదో యని సందేహము.

12 వ. తేదీనని భారతదేశమునకై యోడ నెక్కెను. మెదడు నిండ ననుమానములే! న్యాయవాది కుండవలసిన లక్షణములలోఁ జాలవఱకు లేవు. అందుచే భవిష్యత్తును గుఱించి తహ తహ. బొంబాయి రేవులో నోడ దిగుసరికి స్వాగత మిచ్చుటకై యన్న వచ్చియుండెను. మాతృదేవత మరణించినదను. దుఃఖవార్తఁ జెవుల వేసెను. దానితో గాంధి నిర్ఘాంత పోయినాఁడు. అన్న తల్లి మరణమును దాచియుంచెను. కారణ మేమన విదేశములో నున్నవాఁ డీ బాధ కేల గుఱి కావలె నని. ఆ వార్త గాంధి మనసున కింత యంత యని చెప్పరాని దెబ్బ కొట్టినది. తండ్రి చని పోయిన నాఁటికంటె నెక్కువ వ్యసనదాయక మైనది. ఆయన పెట్టుకొన్న పెద్ద పెద్ద యాశలన్నియుఁ దూలి పోయి నవి. కాని వ్యసనమును బహిరంగముగ వ్యక్తీకరింప లేదు.

కన్నీళ్ళను మ్రింగుకొని, జీవితము నెట్టి దుఃఖావేశమునకు గుఱి కాకుండఁ జూచుకొనెను.

కొంతకాలము రాజకోటలోనె యుండెను. మిత్రులు బొంబాయికి పొమ్మని సలహా నొసఁగిరి. న్యాయస్థానములో ననుభవము, హిందూన్యాయ శాస్త్రమును నేర్చుకొనుట, సాధ్యమైనంత సంపాదన యేక కాలములో జరుగునని తెలిపిరి. వారి సలహా ప్రకారమె నడిచెను. మోహనుదాసు గాంధి బొంబాయిలో 'బారిష్టర్' గ చేరెను.

నాలుగైదు మాసములు గడచినవి. ఆదాయము లేదు—వ్యయ మెక్కువైనది. గాంధి మొట్టమొదట న్యాయస్థానమునఁ బ్రవేశించుటయె యపజయముగ నుండెను. మధ్యమధ్య ప్రశ్నించుటకుఁ దగిన ప్రశ్నలనె యాలోచింపకుండెను. కడకు కూర్చొని, వ్యాజ్యము వేసినవానిఁ బిలిచి, వ్యాజ్యము నడుపఁ జాలనని చెప్పి, పుచ్చుకొన్న సొమ్ము తిరిగి యిచ్చెను, లాభములేదని రాజకోటకువచ్చి బంధువగు న్యాయవాదికి సహాయకుఁడుగఁ జేరి తన సామర్థ్యమును దెలుపునట్లు వినతిపత్రములు, విజ్ఞాపనలు వ్రాయఁదొడఁగినాఁడు. నెల కించుమించు మూఁడువందల యాదాయము. అందుకు గాంధి శక్తిసామర్థ్యములకంటె, పలుకుబడియె ముఖ్యకారణము. పేదలతరఫున వినతిపత్రములు వ్రాయు బాధ్యతయె పడెను.

ఆ రోజులలో నొక సంఘటన గాంధి హృదయములో హత్తుకొనెను. రాజకోటలోని రాజరికపు ప్రతినిధిని (ఆంగ్లే

యుఁడు) తన సోదరుని విషయమై యొకమాట చెప్పుటకై వెళ్ళి దర్శించెను. వాఁడు తిరస్కారపూర్వకముగఁ జూచి, వెంటనే వెళ్ళిపొమ్మనమని—కడకు బలాత్కారముగ గాంధిని పంపించివై చెను. జాత్యహంకారముతోఁ గూడిన ఘర్షణమంధిది ప్రప్రథమము. ఎక్కువ దక్షిణ-ఆఫ్రికాలో జరిగినది. దేశభక్తుఁడు, పీడితజాతుల నుద్ధరించువాఁడయిన గాంధి యతిశయించెను. ఆ యతిశయము దురుద్దేశపూరితముకాదు—పీడితుల వెతలఁ బాపుటకే!

౪

ఒక ముస్లిముల వ్యాపారసంస్థ దక్షిణ-ఆఫ్రికాలో నొకశాఖ కలిగియుండెను. అక్కడనేయున్న మఱియొక వ్యాపారసంస్థతో కొన్నివేల పౌనులతోఁ గూడిన న్యాయశాస్త్రపు నభియోగము దాపురించెను. దాదా అబ్దుల్లా సాహెబు దక్షిణ-ఆఫ్రికాలోఁగల న్యాయవాదులకు సలహానిచ్చు నిమిత్తమె గాంధి నేర్పాటుచేసికొనెను. ఈయన నా వ్యక్తి కోరినందులకు సరియైన కారణములు గలవు. దాని కాతఁడెంతైన నభినందనీయుఁడే! చేయఁగలదానికన్న నెక్కువ సహాయముచేసెను. అబ్దుల్లా సాహెబు తనకుఁ దెలియకనే దక్షిణ-ఆఫ్రికాలోని భారతీయుల కమితసేవ చేసినవాఁడాయెను. రంగువిభేదము దక్షిణ-ఆఫ్రికాలో చాల తీవ్రముగఁ బరిగణింపఁబడుచుండెను. తెల్లజాతివారు భారతదేశీయులైన కూలీల సహాయమును బొంది, వారి మూలముననే చాల ధనవంతులగుచుండిరి. వారి యుక్తిచేత,

తెలివితేటలచేత వ్యాపారస్థులుగను, కర్షకులుగను రూపెత్తిరి
వారు. భారతీయుల నెంతగనో యాకర్షించుచుండిరి—
భారతజాతి యచట దినదినాభివృద్ధిని గాంచిన తెల్లవారి
చేత పోటిపడుచుండిరి. తత్ప్రతిఫలముగ భారతీయులు
ఘోరావమానముల పాలు కావలసివచ్చినది. భారతీయులు
పశువులవలె చావఁగొట్టఁబడి, ముఖ్యవీథులనుండి పార
ద్రోలఁబడి, రైళ్ళలో నున్నతమైన తరగతులఁ దిరుగనీయక,
తెల్లదొరల గుఱ్ఱపుబండ్లలోఁ బోనీయకుండుట, శిక్షితుల
వలె 'రిజిస్టరు' (నమోదు) చేసికొమ్మనుట, విపరీతముగఁ
బన్నులు వేయుట జరుగుచుండెను. గాంధికూడ కూలి
'బారిష్టరు' గనె తెలియఁబడెను.

గాంధి స్వయముగ నీచమైనపనులకు గురియైనాఁడు.
ముఖ్యమార్గముల, రైలుపెట్టెలందు, గుఱ్ఱపుబండ్లవిషయ
ములో నవమానకరమైన ప్రవర్తన. ప్రతివిషయములోను
గాంధి ప్రతిఘటించి. యన్యాయమును సరిదిద్దుటకై,
యున్నతాధికారులను గోరువాఁడు. ఎప్పుడును స్వకీయమైన
దానికిని, వ్యక్తిగత నష్టముల విషయములోను చట్టము
తిరస్కరించెడిది. 1894 వ సంవత్సరములో భారతదేశము
నకుఁ దిరిగిరావలెననియుండ దక్షిణ-ఆఫ్రికా శాసనసభలో
భారతీయు లెవ్వరును శాసనసభకు రాకుండఁజేయుట కొక
శాసనము ప్రవేశపెట్టనున్నారని వినెను. దానికి వ్యతిరేకత
ప్రదర్శింప గాంధి సంకల్పించినాఁడు. తన యుద్యమఫలితము
గనే నేటాల్ భారతమహాసభ (కాంగ్రెసు) పుట్టెను. త్వర

లోనె యన్యాయమున కంతటికిని ప్రతిఘటించుకే ప్రయత్నించెను. వ్యక్తిగతమైన యొకని యభియోగములో న్యాయము బొందిరి. ఒక తమిళుఁడగు కూలి యజమానిచేత (యూరోపియను) చాల నవమానింపఁబడియుండెను. ఇదియె ప్రథమ విజయము.

గాంధి డర్బాన్ న్యాయస్థానము చూచుటకు పిలుచుకపోఁబడెను. అబ్దుల్లా సేట్ అందఱితో పరిచయముచేసి, తన న్యాయవాది ప్రక్కన కూర్చోనఁబెట్టినాఁడు. న్యాయాధికారి గాంధివైపు తదేకదృష్టితోఁ జూచి, తలపాగ తీసివేయమని కోరెను. అందులకు సమ్మతింపక న్యాయస్థానము నె వదలి బయటికి వచ్చినాఁడు. పోరాటమున కిక్కడ నవకాశము లభించెనని భావించెను. అబ్దుల్లా సేట్ తలపాగపైఁగల నిషేధమును వివరించినాఁడు. తలపాగ తీయమనుట యవమానము కాఁబట్టి 'ఇంగ్లీషు' టోపిపెట్టుకొన్న బాధ లేదని గాంధి నిశ్చయించుకొనెను. అబ్దుల్లా ప్రతిఘటించి, "అట్లుచేయుట సరికాదు. భారతదేశపుపద్ధతి తలపాగ నాకు చక్కఁగనున్నది. దానిపైఁగల వ్యతిరేకతను దొలఁగించవలెను గాని, నీవె మార్పునందఁగోరుట తగదు. అది చెడు ఫలితముల నిచ్చును." అని బోధింప గాంధిలో నెక్కడలేని ధైర్యము, దేశభక్తి ప్రబలినది. వెంటనే జరిగిన సంఘటన నంతయు వార్తాపత్రికలకు వ్రాసెను. దానిపై వాదప్రతివాదములు చెలరేఁగినవి. ఆ సంఘటన దక్షిణ-ఆఫ్రికాలో గాంధి యడుగుపెట్టిన కొన్నిదినములలోనె యాయనపే రంద

అకుఁ దెలియు నట్లు గావించెను. "స్వాగత మీయఁదగని యాత్రికుఁ"డని తెల్లదొరలు వ్యాఖ్యానించిరి.

ఒకవారము గడచినపిమ్మట డర్బాన్ వదలి ప్రెటోరి యాకు ప్రయాణమైనాఁడు. రైలుకు మొదటితరగతి 'టికెట్టు' అబ్దుల్లా బలవంతమున తీసికొనెను. రైలు నేటాల్ దేశపు రాజధానినగరమైనట్టి మార్టిజ్ బర్గ్ కు చేరెను. ఒక రైల్వే యుద్యోగివచ్చి గాంధి నల్లజాతివాఁడని గుర్తించి, "నీవు నా వెంటరమ్ము. మూఁడవతరగతి పెట్టెలోఁ బ్రయాణించుము." అనెను. గాంధి తనదగ్గఱ మొదటితరగతి 'టికెట్టు' కలదని తెలిపెను. "ఏమైన నుండ నిమ్ము. నీవక్కడకు వెళ్లి తీరవలసినదే!" అని తెలుప "డర్బాన్‌లో నన్నీపెట్టె నెక్క నిచ్చిరి. ఇందులోనె ప్రయాణముచేయవలెనని నాయభి ప్రాయము" అని గాంధివివరింప "నీవీపెట్టెనుండి వెళ్ళిపోయితీరవలె. లేకున్న రక్షకభటుని పిలిచెద"ననెను. కడకు రక్షకభటుఁడువచ్చి గాంధిచేయిపట్టుకొని, క్రిందికిదింపెను. పూర్వనిర్ణయమును మార్చుకొనుటకు గాంధియిష్టపడఁడాయె. చివఱకు రైలు కదలినది. విశ్రాంతి గదిలోనికివచ్చియాఱక చింతింపసాగెను. ఉదయమే రైల్వేశాఖాధిపతికి తనకు జరిగిన యవమానమును 'పూసగ్రుచ్చినట్లు' వివరించుచు తంతి వార్తనుపంపినాఁడు. అబ్దుల్లాసేటుకుకూడ తెలుపుకొనెను. పైయధికారి రైల్వేయుద్యోగుల చర్యనె సమర్థించెను.

అప్పుడు గాంధికి యనేకవిధములైన యాలోచన లుద్భవించినవి. తన విధ్యుక్తధర్మమునుగుఱించి విమర్శించు

కొనసాగెను. అవమానముల నన్నింటిని సహించుకొని భారత దేశమునకుఁ దిరిగిపోవుటయా? లేక ప్రతిఘటించుటయా? స్వీయధర్మమును నెఱవేర్చకుండ భారత దేశమునకు తిరిగిపోవుట పిఱికితనము. తాను పడినకష్టములు నామ మాత్రములే! రంగుభేదము, దానిపైగల యసూయతలచేత నెందఱెంతెంత కష్టములపాలగుచున్నారో? అని యాలోచించి తుదకు రంగుభేదమును రూపుమాపుటకై ప్రయత్నింప వలెననియు, దానికై యెన్నికష్టములనైన ననుభవించుటకు వెనుదీయరాదనియు గాంధి నిశ్చయించుకొనెను. వ్యక్తిగత దోషముల నిందుకు లెక్కఁగొనఁగూడ దనుకొన్నాఁడు.

1893 వ. సంవత్సరములో దక్షిణ-ఆఫ్రికాలోని భారతీయులను గుఱించి నట్టి వివరముల నన్నింటిని గాంధి సేకరిపఁ గలిగినాఁడు. తానే వ్యాజ్యమునకై వచ్చెనో యది విజయాంతమైనది. డర్బాన్‌కు వచ్చి భారత దేశమునకుఁ దిరిగిపో నెంచెను. అబ్దుల్లా బ్రహ్మాండమైన వీడ్కోలు సభ జరిపినాఁడు. అందులో నొక విజ్ఞప్తి గాంధి కందఁ జేయఁబడినది. నేటాలు శాసన సభ భారతీయులకు వోటుకు హక్కు లేకుండ చేయఁదలపెట్టిన శాసనమును గుఱించి వ్రాయఁబడెను. అంతవఱకు వలసపోయిన భారతీయులు కొద్ది పాటిగ నైనఁ గలిగియున్న యా హక్కు లా శాసనముతో నంత మగును. వెంటనే గాంధి భారత దేశ ప్రయాణము నాపుకొని నేటాలు శాసన సభ కొక వినతి పత్రమును బంపెను. చట్టముఁ బ్రవేశ పెట్టుట నాపవలసినదిగ వేఁడు

కొనఁ బడినది. దక్షిణ–ఆఫ్రికా శాసన సభలకు భారతీయులు పంపిన మొట్ట మొదటి వినతి పత్ర మదియె. భారత ప్రజ లందఱిలో నొక విధమైన చైతన్యము వచ్చెను. ప్రతి చోట సభలో సమావేశములు జరిపిరి. ఇంచు మించు పదివేల సంతకములున్న 'మహజరు' ప్రభుత్వమున కందించిరి. చట్ట మును మాత్ర మీయుద్యమ మాపలేక పోయెను.

నేటాల్ కాంగ్రెసు సరిగ సంఘటింపఁబడినది. భార తీయు లందఱు నుత్సాహముతోఁ జేర్గొనిరి. ధనము కావలసిన దాని కన్న నెక్కువగనె సమకూర్పఁ బడెను. భారతీయుల మంచి చెడ్డలు, నేటాలు కాంగ్రెసు కార్య క్రమములు వార్తా పత్రికలలో సరిగ ప్రచురితము లయ్యేడివి. ఐరోపా దేశస్థులతో సమానస్థాయి, యాత్మగౌరవమునకు భంగము రాని విషయములలో భారతీయు లేకీభవింతురని ప్రకటించి నప్పు, డాసహకారమును యూరోపియనులు స్వాగత పూర్వకముగ స్వీకరించువారు. దక్షిణాఫ్రికాలోని భారతీయుల కందఱకు గాంధి పరమాప్తుడుగఁ దెలిసి పోయెను. గాంధికి కూడ చాలమందితోఁ బరిచయ మేర్పడి నది. మూఁడు సంవత్సరముల యనంతరము భారత దేశము నకు 1896 సం. తిరిగివచ్చెను.

బొంబాయినుండి "ఆకుపచ్చ కరపత్రము" అనుదాని నొకటి ప్రకటించెను. అందులో దక్షిణాఫ్రికా భారతీయులు కష్ట సుఖములు మొదలగునవి వివరించినాఁడు. ఆ కరపత్రము దేశమంతట పంచఁబడెను. దక్షిణాఫ్రికా భారతీయుల

సమస్య గురించి దేశములోని నాయకు లందఱు తోడను చర్చించినాఁడు. బహిరంగ సభలలో నుపన్యసించుచు, దేశ మంతయుఁ బర్యటించెను. ప్రముఖ పత్రికా రచయితలను గూడ కలిసికొని గొప్ప యాందోళనము లేవఁదీసెను. దానితో ద. ఆఫ్రికా భారతీయులపై యిచటి ప్రజల కను రాగము హెచ్చెను.

కొన్ని నెలలు భారత దేశములో దక్షిణ-ఆఫ్రికాలోని రంగుభేదమును నిరసించుచు చేసిన యాందోళనము ఫలిత ముగ నచటి 'యూరోపియనులు' గాంధిపై నసూయ, ద్వేషములను వృద్ధిపఱచుకొనిరి. ఈమాఱు గాంధిభార్య, ఇద్దఱు కుమారులతోడను బ్రయాణమైనాఁరు. గాంధి ప్రయాణముచేయుచున్న యోడ మధ్యలో మూఁడువారము లాపుచేయఁబడెను. ఆయన యడుగుపెట్టిన జాగ్రత్తయని భారతీయులకు జాబులు వ్రాయుచుండిరి. ఓడకుఁజెందిన వ్యాపారసంస్థవారికి గాంధిని వెనుకకుఁ దీసికొనిపోయిన నెంతోధనమొసంగుదుమని చెప్పిరి. ఆయనదిగిన చాలకష్ట నష్టములుగలునని భయపెట్టసాగిరి. ఇట్టి పరిస్థితులలోను గాంధి యోడదిగి, ఒక 'యూరోపియను' వెంట నాతని స్నేహితునియింటిలో దిగెను. మార్గమున తెల్లవారిగుంపు గాంధినడ్డగించి చాల యవమానపఱచినది. ఆ సమూహము చాల దౌర్జన్యమునకు దిగగ, నొకఁడు గాంధిముఖముపైఁ గొట్టి ప్రక్కకుఁ ద్రోసెను. ఱాళ్లు రువ్వబడినవి. మీఁద పడిన దెబ్బల కంతులేదు.

అదృష్టవశమున నాసమయములో యొకపోలీసు ఉన్నతాధికారిభార్య శ్రీమతి అలెగ్జాండరు అడ్డుపడి, వారి బారినుండి తప్పించి, గాంధి యాతిథేయుఁడైన సేతురుస్తుంజి యింటికి సురక్షితముగఁ జేర్చెను. అక్కడకుఁగూడ నీ తెల్ల వారిగుంపు వెళ్లి గాంధిని వారి కప్పఁజెప్పకున్న నింటిని తగులఁబెట్టుదమని బెదరించిరి. మరల నపాయకరమైన పరిస్థితి తోలఁగింపఁబడెను. ఈ సమయములో పోలీసు ఉన్నతాధికారియైన మిస్టర్ అలెగ్జాండరు స్వయముగవచ్చి వారి కందఱకు హాస్యరసము చిప్పిల్లుమాటలు చెప్పచుకొంతసేపు కాలయాపనచేసి, గాంధి నచటనుండి మఱియొకయింటికి పంపివైచెను. ఈఘటన యెల్లర దృష్టినాకర్షించెను. వలస రాజ్యముల కార్యదర్శియగు మిస్టర్ చేంబర్లిన్ దౌర్జన్యముఁ జేసినవారిని శిక్షింపవలసినదిగ నధికారుల కాజ్ఞాపించెను. అప్పుడు గాంధి తనపై దౌర్జన్యము చేసినవారందఱిని చూపింపఁగా వారుకాదని, గుఱుతింప నిష్టపడలేదు. వారిపై నెట్టి యభియోగముఁ బెట్టుటకైన సమ్మతింపఁడయ్యె. దౌర్జన్యపరులు గాంధిచూపిన నిగ్రహమున కాశ్చర్యచకితులైరి. అదియొకదా యుదాత్తపురుషలక్షణము? అసహ్యించుకొనుటకంటె ప్రేమయె గొప్పది—విజయమునుగూడ సాధింపఁగల మహత్తరశక్తి యదియె!

1899 సం. లో బోయరు యుద్ధము వచ్చినప్పుడు డంద ఱును నాశ్చర్యచకితులగునట్లు గాంధిచేసెను. బోయరులపై నభిమానమున్నను భారతీయులను యుద్ధములో బ్రిటిషువారికి

తోడ్పడఁగోరినాఁడు. అప్పుడు గాంధి వాదించిన దేమనఁగా బ్రిటిషువారితో సమానమైన పౌరత్వముఁ గాక్షించినప్పుడు భారతీయులు తమ విధ్యుక్తధర్మము నేమరరాదని. యుద్ధ రంగములో సహాయమొనర్ప వైద్యదళమును స్వయముగ నొకవేయిమంది భారతీయులతో నేర్పఱచెను. ఈ వైద్య దళము సేనలు బ్రిటిషుప్రజలచేతను, ప్రభుత్వముచేతను మిక్కిలి కొనియాడఁబడినవి. గాంధియొక్క గొప్పతన మెంతైన నీకార్యముచే బయలుబడెను. కష్టపరిస్థితులలో విభేదములను మఱచుటయె యుత్తమ మానవధర్మమని ప్రపంచమునకుఁ చాటఁగలిగినాఁడు.

1902 వ. సంవత్సరములో తన తోడి దేశభక్తుల పిలుపును మన్నించి దక్షిణాఫ్రికాలోని భారతీయుల హక్కుల కొఱకై బ్రహ్మాండమైన పోరాటమునకు దిగెను. సాధ్యమై నంత త్వరలో భారతదేశమునకు దిరిగి రావలెనని మొదట సంకల్పించెను గాని కడకు 12 సంవత్సరములు దక్షిణ-అఫ్రి కాలో నుండవలసినవాఁ డాయె. 1910 వ. సంవత్సరములో నొక మాఱు మాత్ర దేశమునకు వచ్చెను. అప్పుడు కల కత్తాలో జరిగిన కాంగ్రెసు సమావేశమునకు వెళ్ళినాఁడు. ఆతని సేవ కెంతో యవకాశము లభించినది. స్వచ్ఛంద సేవకులకు నూడ్చుట, ముఱికి దొడ్లు పరిశుభ్రము చేయు టలోఁ గల విశేషములఁ దెలుపు నుపన్యాసముల నిచ్చెను. ప్రధాన కార్యదర్శిగ నుండిన శ్రీగోపల్ దగ్గఱ నుద్యోగిగ నుండు నదృష్టము నోఁచుకొనెను. దక్షిణాఫ్రికా భారతీయు

లను గుఱించి యొక తీర్మానము ప్రవేశ పెట్టు పుణ్యము లభించినది. దేశములో నడుగు పెట్టి నప్పటి నుండియు గోఖలే సాహచర్యము. సోదరుని వలె నాయన గాంధిని ప్రేమించువాఁడు. గాంధి కార్యక్రమములలో నెక్కువ శ్రద్ధ తీసికొని, పెద్ద పెద్ద వారందఱితోఁ బరిచయము గావించెను. గోఖలేపై గాంధి కెక్కడ లేని యభిమానము. దక్షిణ-ఆఫ్రికానుండి యిచ్చటికే వచ్చి, బొంబాయిలో న్యాయవాదవృత్తి నవలంబించి, ప్రజాహితోద్యమములఁ బాల్గొనుమని గోఖలే సమయము దొరకి నప్పు డెల్ల బోధించువాఁడు. ఆయన సలహా గాంధికి బాగుగనె నచ్చెడిది కాని, న్యాయవాదిగ విజయము సంపాదింపఁ జాల నను బెంగ. రాజకోటలోఁ గొంతకాల ముండి, బొంబాయికి వెళ్ళి చేరి పోవుదమని గాంధి చింతించు చుండ మరల దక్షిణ-ఆఫ్రికానుండి పిలువు వచ్చినది.

తక్షణమె బయలు దేఱి వెళ్ళినాఁడు. యుద్ధము ముగిసిన తరువాత భారతీయులు చేసిన సహాయము తెల్ల వారు మఱచిరి. మరల భారతీయుల స్థితి యథాతథ మయ్యెను. పూర్వమున కంటె నింకను పరిస్థితులు విషమించినవి. జాత్యహంకారముచే వారు ప్రవర్తించుచు భారతీయుల కష్టముల కంతు లేకుండఁ గ్రొత్త సమస్యలు తెచ్చిపెట్టిరి. అక్కడి భారత దేశ ప్రజల నుద్ధరింప వలె నన్న నేంకా తర బడి నివసింపక తప్పదని గాంధి గ్రహించెను. కడ కొక నిర్ణయమునకు వచ్చి జోహానెస్ బర్గులో మఱల ప్రయత్నము మీఁద కార్యాలయమును స్థాపించుటకు గదులు సంపాదించి

నాఁడు. ఇంత కాలము సమయానుకూలముగ ప్రారంభ మగు చుండిన పోరాట మిప్పు డొక దీర్ఘ ప్రణాళికపై నాధార పడి సాగుట కాలోచింపఁ బడెను.

పండ్రెండు సంవత్సరములు దక్షిణ-ఆఫ్రికాలో గాంధిజి గడిపిన జీవితమాయన నొక యున్నతస్థాయిలోనికిఁ దీసుక పోఁగలిగెను. ప్రజలకొఱకై పోరాటము సల్పువానిగను, విశ్రాంతియెఱుఁగని సంఘసేవకునిగాను, సత్యాగ్రహిగాను, నిరాడంబరమేకాక ఋషిపర్యాయమైన మహాత్మునిగను విశ్వమర్థ మొనర్చుకొనెను. ఆ పండ్రెండు సంవత్సరములు దక్షిణ-ఆఫ్రికాలోని మహాత్ముని జీవితక్రమము చాల కష్టనష్ట పూరితమెగాక, సాటిలేనట్టి పోరాటములు గలదియు, మహా త్యాగసాహసములకుఁ దావలమైనదై, యాధ్యాత్మికరంగ మందు నత్యంతోత్సాహ జనకమైనది. ఆనాఁడే ప్రపంచ మొక యుగపురుషుఁడని మహాత్ముని కీర్తిగానము గావించెను!

గాంధిజి మానవోత్కృష్టత నొక్కమాఱు ప్రదర్శిం చెను. అది యనితరసాధ్య మసాధారణము. 1904 వ సంవత్సరములో జోహెన్స్‌బర్గు భారతీయుల నివాసప్రదేశ మందు 'నల్ల' ప్లేగు వ్యాపించెను. అప్పుడాయన తనతోడి ప్రజాసేవకుల సహాయముతో వారికిఁ గావలసిన సేవ చేయుచు, బాధితులైనవారి కుపచారము లొనర్చుచు, ఆ ప్రాంతమునె శుభ్రపఱచెను. ఈ కార్యక్రమములన్నియు నద్భుతమైన స్వార్థత్యాగముతోఁ గూడినవి. ఇక్కడ యితరస్థలములలో

—నె ప్రజలకు నాయకుఁడు కాఁగలవాఁడనియు, ప్రజా సేవకై సర్వకాలము వినియోగించువాఁడనియు, సేవయె జీవితపరమలక్ష్యముగ భావించువాఁడనియు నందఱును దెలిసికొనునట్లు సేవాపరాయణత్వముఁ జూపెను.

1906 వ సంవత్సరములో "జులు విప్లవము" చెలరేఁగెను. కొందఱు భారతీయులచే సంఘటిత పఱచిన వైద్యదళమునకు నాయకుఁడుగ నుండి గాయములు తగిలిన జూలులకు సేవయొనర్చి, సంతృప్తిచెందు మహద్భాగ్యమునకు గాంధి నోఁచుకొనెను. అప్పుడె రస్కిన్ వ్రాసిన యొక గ్రంథమును జదువుట తటస్థించినది. ఆయన తెలిపిన మానవసంబంధమైన జిజ్ఞాస, నిరాడంబరత్వము, సేవ—విలాసములు, పోటీలకు బదులుగాఁ దెలిసికొనెను. ఆ గ్రంథ మాయనలో నెక్కువగఁ బని చేసినది. రెండువందలమంది తోటి సేవకులతో నాయనయున్న ప్రదేశమందు సమానత్వము—సౌభ్రాతృత్వము లాదర్శముగా నివసించుట కాస్కారమైనది. మానవులమధ్య తరతమ భేదములు పాటించుట తగదని గాంధి యప్పటికే యెఱిఁగెను. అది తన నిత్యజీవితములో నాచరణమందు పెట్టఁగలిగినాఁడు.

కాయకష్టమునఁ గల యుద్దేశ్యములను, గొప్ప తనమును, సేవాహింసలపై ప్రేమను, స్వార్థరహితమై సంతోషముతోఁ జేయు త్యాగమును, నిరాడంబరము జీవనము—భోజనము—వస్త్రములఁగలిగి, మఱి యితరవిషయములును గాంధిలో సరియైన విధానముతోఁ గూడి, "ఫోనిక్స్

నివాసప్రదేశము"లో బయలుపడెను, పై గుణవిశేషము లన్నియు నాయనలో శీఘ్రగతిని, యన్యోన్యసంబంధములతో వృద్ధికి వచ్చినవి. ప్రతివారును గష్టపడి, సమానమైన వేతన మును బొంది, విశ్రాంతి సమయములో "భారతాభి ప్రాయము" అను పత్రిక కేర్పఱచఁబడిన ముద్రాక్షర శాలలోఁ బనిచేయుట కనువుగ నీయూహ గాంధికి తట్టెను. 20 ఎకరములు భూమి కొన్నాఁడు. దానికి సమీపముననే మంచి ఫలవృక్షములతోడను, సామాన్య వృక్షములతోడ నుండిన 80 ఎకరములను గొనెను. 'యూరోపియనుల'తో సహా కొంతమంది కాపుర మేర్పాటు చేసికొనిరి. తన ధన మును, సంపాదనమును 'ఫోనిక్సు' నివాస ప్రదేశమునకే వ్యయించెను. చాల ధనవ్యయ ప్రయాసలతోఁ గూడిన "భారతాభిప్రాయ" మనుదిన పత్రికను నడిపినాఁడు. తన కుటుంబమె కాక, యచ్చట నివసించువార లందఱకు సామూ హిక జీవనము—ధనములో భాగస్వామ్యము—కష్టపడి పని చేయుట—వ్యవసాయము—తోటపని—ఫలములు పండిం చుట—మొదలగు నున్నతాదర్శ జీవనవిధానములే గాక, ప్రతివారికిని కావలసిన వస్తుపరిమాణము చాల నియమిత మగునట్లును, విలాసాదులకుఁ, గావలసినదానికన్న నెక్కువఁ గలియుండుటకు నవకాశము లేనట్లుగావించెను. ఇది ప్రపంచ ములో నపురూపమైనది.

చాలదీర్ఘముగ నాలోచించి గాంధి యొకనిర్ణయ మునకు వచ్చినాఁడు. మహాత్ము లేనిర్ణయమునకైనను వచ్చు

టకుముందు దాని మంచిచెడ్డలు, పరిణామాలను గుఱించి తీవ్రముగ మనస్సులో విమర్శించుకొందురు. ఆ తీవ్రవిమర్శానంతరము గైకొన్న నిర్ణయమును జీవితాంతము మార్చుకొనఁ జూడరు. అదియె వారిలోని గొప్పతనము. గాంధి కూడ "మానవుఁడు శారీర, కాధ్యాత్మికపటిష్ఠతలు లేనిదే బ్రతుకుటకు వలనుపడ" దనుకొని, మానవుల సేవింపఁదలచుకొన్నవారి కెవరికైనా బ్రహ్మచర్య మత్యవసరమని సిద్ధాంతీకరించుకొనెను. 1906 వ. సంవత్సరములో బ్రహ్మచర్యమునకుఁ బ్రతిజ్ఞగైకొనెను. ఆ ప్రతిజ్ఞను జీవితాంతము వఱకుఁ బాలించుకొనుటలో గాంధిచూపిన మనోనిగ్రహము వర్ణనాతీతమని చెప్పకతప్పదు.

గాంధిగారి పర్యవేక్షణక్రిందనున్న "ఫొనిక్స్" నివాసము కొంచెమించు ఋష్యాశ్రమ తుల్యమైనది. రస్కిన్, టాల్‌స్టాయి లేవిధానములఁ గలుగకనిరో యవి నిజమై వానితోఁ గూడుకొన్న యొక సంస్థవంటిదయ్యెను. ఒక యుదాత్తపురుషుఁడు, ఋషి, మహాత్ముఁడు బయలువెడలెను. అక్కడ నివసించువారిలో వివిధమతములకుఁ జెందినట్టి హిందువులు, క్రైస్తవులు, ముస్లిములు నుండిరి. ఎవరిమతములను వారారాధించుకొనుచు, నితరుల మతములపై గౌరవము కలిగియుండిరి. ప్రతివారు భక్తి, యాధ్యాత్మిక తత్వమందు ప్రేమ, యారాధన, త్యాగము నచ్చటి ప్రముఖుని మొదలు సామాన్యునివఱకు నొకేరీతి నుండుటవిశేషము. సభ్యులలో జాతి, మత, కుల భేదములకు

సంబంధించి కాని ధన, వర్గ, విద్యా తారతమ్యములుగాని లేవు. అందఱు నన్ని విషయములలో సమానులే!

అచట నివసించువారిలో నప్పుడప్పుడు కొన్ని పొరపాటులు సంభవించెడివి. వానిని తక్షణమే సరిదిద్దుటకొక మహాప్రభావయుతమైన సాధనమును గాంధిజి కనిపెట్టెను. వారు చేసిన తప్పులకై తాను బాధపడువాఁడు. ఉపవాస వ్రతములు చేయుట మొదలుపెట్టెను. మొట్టమొదటి యుపవాసము వారమురోజులు. తరువాత నాలుగున్నఱ నెలలు. దినమునకొకపూటనె భుజింతునని ప్రతిజ్ఞఁగైకొనెను. పై నియమ మాశ్రమములోనుండు నిర్వారదోషములను సరి చేయుటకె, ఇత్యాది పాశుపతాస్త్రమువలె నాశ్రమ వాసులపై మహాప్రభావయుతముగఁ బనిచేసిన దనవచ్చు. ఆశ్రమ జీవితములో నిట్టి యుపవాసవ్రతములు పదియునెనిమిది జరిగెను. వాని ప్రభావమున నచటివారిలో వాస్తవిక పరిజ్ఞానము, నాధ్యాత్మికపు విలువలు, హెచ్చుగుటయె గాక, సత్యమునకొక బ్రహ్మాండమైన విజయము సంప్రాప్తించినది.

ప్రపంచచరిత్రలో మఱియెచ్చటైనను "ఫొనిక్స్" ఆశ్రమవంటిది గలదా? అనునది సందేహాస్పదమైన విషయము. ఇదియొక యత్యున్నతస్థాయి నందుకొని, నివసించువారల నందఱవారితోఁబాటు జాతికీ స్థాయిలోనికిఁ దీసికొని పోఁగలిగినది. ఆమాత్రమె కాక, చాలలోతైన యాధ్యాత్మికచింతన, ప్రార్థన, సత్యము, అహింస, ప్రేమ;

సేవ, కష్టములనెదుర్కొను సాహసము, సంతోషపూర్వకముగ త్యాగమొనర్చుట, నేదియు గలిగియుండకుండుట, సుఖములుకోరని నిరాడంబరత్వము, నసాధారణమైన కార్యపరాయణత్వము వారి సహజజీవితములో స్థానమేర్పఱచుకొనఁ గలిగినవి. ఇట్టిది మున్నెన్నడుఁ జరిత్రలోఁ గన్నదియు లేదు — విన్నదియుకాదు. ఇవియే మానవుని జీవితాదర్శములు. ఆ యాదర్శములకన్నింటికిఁ గేంద్రము నొకదానిని సృష్టింపఁగల మహనీయుఁడు కావుననే ప్రపంచ మాయనను మహాత్ముఁడని గౌరవించినది.

సహజముగ నట్టి మహోత్కృష్టగుణముల కలయికచే నాశ్రమవాసులకు ఋషితుల్యుఁడైన నాయకుఁడై, వారి ప్రేమపాత్రుఁ డగుటయేకాక, చెఱుగును బ్రతిఘటించు వారిలో ముఖ్యుఁడై, జాతీయశక్తులను నడిపించుటలోనె తరొము శ్రమఁజేయువాఁడై, యన్యాయమునను భిన్నముగ దేశభక్తితో — సద్విధానముతోఁ బోరాడుటకుఁ గేంద్రము వంటివాఁడైన మహామహుఁడు. అంతియెకాక, క్రొత్త విధానమొకటి కనిపట్టెను. అదియె "సత్యాగ్రహము." అన్యాయము నెదుర్కొనుపద్ధతిగ శ్రమనుప్రేమించుటయె సత్యాగ్రహము. ఈపదము మొట్టమొదట "ఫోనిక్సు" ఆశ్రమములో నొకస్వరూపమును బొందెను. కడకు జాతీయోద్యమమునకు జీవగఱ్ఱయయ్యెను. రానురాను దాని ప్రభావ మెఱుఁగనివా రెవరునులేరు. గాంధిజి మహోత్తమాదర్శములకు దక్షిణ ఆఫ్రికాయె జన్మస్థానమైనది.

1906వ సంవత్సరములో "ఆశియా నమోదుచట్టము" Asiatic Registration Act) దక్షిణాఫ్రికాలో ప్రభుత్వము చేసిన మఱికొన్ని శాసనములు నచట నివసించు భారతీయులపై తెల్లదొరలు మహావమానకరములగు నిర్బంధములు పెట్టుటకై యుద్దేశింపఁబడినవి. వానిమూలమున భారతీయుల వలసను నిరోధించుట, పన్నులు వేయుట, యభియోగములు పెట్టి యగౌరవించుట, మఱి యేవిధానమునైనను వారిని యణఁగఁ ద్రొక్కుటకు నవకాశములు తెల్లదొరలకు లభించినవి. అంతియేకాక భారతీయుల నిత్యజీవితముతో శాసనములు ప్రమేయముఁ గలిగించుకొన్నవి. వారిపౌరత్వము, సంచారార్హత, పెండ్లిసంబంధములుసైతము ప్రభుత్వపు దయాదాక్షిణ్యాలమీఁదనే ఆధారపడినవి. అదియె తొల్లి సత్యాగ్రహమునకు నాంది. శిక్షణఁ బొందిన ప్రజలు సిద్ధముగ నున్నారు. దక్షిణ-ఆఫ్రికాలో నన్యాయ మొకపొంతనపడినది.

గాంధిజి నాయకత్వమున భారతీయులు శాసనధిక్కారముగావించి వేలసంఖ్యలో చెఱసాలల కేగుటకు సిద్ధమైరి. అందులకుఁ దార్కాణముగ మహాత్ముఁడు శాసనోల్లంఘన మొనర్చి మొదటిసారి చెఱసాలకు వెళ్ళెను. వేలకొలఁది యాయన ననుసరించిరి. చెఱసాలలన్నియు నిండిపోయినవి. కొన్నివందలమంది స్త్రీలు, కస్తూరిబాయినాయకత్వమున కృష్ణజన్మస్థాన మలంకరించిరి. నమోదుపఱచుకొను కాగితములఁ దగులఁబెట్టి, నిషేధింపఁబడిన వీథులగుండ గుంపులు గుంపు లూరేఁగిరి. వ్యవసాయపు శ్రామికులు సమ్మెచేసిరి.

వ్యాపారము తల్లక్రిందు లొనర్పఁబడెను. ఇంతజరిగినను హింసావిధాన మొక్కటియును లేదు. సామాన్య సత్యాగ్రహులమూలమున శాంతికి భంగమే మాత్రము కలుగకుండెను. వారె గాయపఱచఁబడి, తుపాకిగుండ్లకెఱయై కొంతమంది మరణింపవలసివచ్చెను. భారతీయులు చూపిన యచంచల ధైర్యసాహసములు ప్రశంసాపాత్రములు.

గాంధి యాశ్రమములోను స్త్రీలనందఱిని సత్యాగ్రహము విషయములో నడిగి చూచెను. వారికి చెఱసాలల కేగు సాహసము గలదో, లేదో నని యాయన చింత. మొదట నంగీకరించినను, దరువాత కార్యక్రమములో వెను కంజవైచుదురేమోనని భయము. చెఱసాలకు వెళ్ళినను, గష్టములు సహించు శక్తిలేక, క్షమాపణకోరుకొని బయట పడఁగోరెదరేమో? అట్లుచేసిన యుద్యమమునకు దెబ్బతగులును. ఈ సాధకబాధకముల నాలోచించి, వారలతో మాట్లాడుచుండఁగా కస్తూరిబాయి విన్నది. భర్తనుద్దేశించి, "మీరు నాకీవిషయమునుగుఱించి యేమియుఁ జెప్పకున్నందులకుఁ జింతగనున్నది. నే నీసేవ కెందులకనర్హురాలనైతిని? మీ రితరుల నెందులకై పిలుచుచున్నారో, యందులో నేనుఁ బాల్గొనవలెనని వాంఛ" అనియెను. అప్పుడు గాంధి "నీకు తెలిసియే నీకేమాత్రము బాధకలిగించువాఁడను గాను. నీమీఁద నాకు నమ్మకము లేదను ప్రశ్న కిక్కడ తావులేదు. నీవు చెఱసాలకు వెళ్ళిన చాల సంతోషించువాఁడను నేనే! నాప్రోత్సాహముచేతనే వెళ్ళినా వనిపించుకొనఁగూడదు. ఇట్టి

విషయములలోఁ బ్రతివారు తమ యిచ్ఛవచ్చినట్లు బలమును సాహసమునుబట్టి ప్రవర్తింపవలయును. నేను నీకు నేర్ప వలసినదిలేదు. న్యాయస్థానములకుఁ దీసికొనిపోయినప్పుడు కంపింపసాగినను, చెఱసాలలోని బాధలకుఁ దాళలేకపోయినను నీకు, నాకుఁ గష్టమే! అసలు విషయమునకె హాని". అన కస్తూరిబాయి "మీకు నావిషయముతో నేమియు నక్కఱ లేదు. మీరు, నాబాలురు కష్టపడుచున్నప్పుడు నే నెందుల కట్టికష్టములు పడలేను? తప్పక నే నీపోరాటములోఁ జేర వలసినదే!" తరువాత గాంధి కష్టసుఖముల నాలోచించి, మఱియు నిర్ణయమునకు రావచ్చుననియె. కస్తూరిబాయి యామాటల కొప్పుకొనక "నే నెప్పుడో నిర్ణయించుకొన్నాను. ఆలోచింప నవసరములే" దనియెను.

స్త్రీలుచూపిన ధైర్యసాహసములనుగుఱించి గాంధీజీ యిట్లువ్రాసినాఁడు. "సోదరీమణులుచూపిన త్యాగము నిశ్చితముగ శుద్ధమైనది. త్యాగము ఫలప్రదాయి యగుట యది శుద్ధమైనదిగ నున్నప్పుడే! ఎందఱో చెఱ శాలలకేగుట నిరర్థకమే కావచ్చు—ధ్యేయాత్మకమైన త్యాగ మొక్కఁడుచేసినను వృథ కాదు. ఎంతమంది దేశ— మానవసేవలు చేయుటలో తమప్రాణము లర్పించిరో లెక్కింపలేము. అందులకుఁ దగినట్లు పరిశుద్ధులెవరో చెప్ప లేము. కాని, సత్యాగ్రహులొక్క విషయములో దృఢముగ నమ్ముకొనవలె. వారిలో నే యొకరైనఁ బరిశుద్ధులైన యెడలఁ దనత్యాగ మాహాంఛను నెఱవేర్పఁగలదు. ప్రపంచ

మంతయు సత్యముపైననె యాధారపడియున్నది. అసత్య మనగా సత్యముకానిదేదో యది. చాలకాల ముండఁ జాలనిది—దాని విజయమేమన మరణమే! సత్యమన నెప్పటికిని నశింపఁజేయరానిది, యెప్పటికిని విజయవంత మైనది! ఇదియె సత్యాగ్రహముయొక్క మూలసిద్ధాంతము. స్త్రీలు చెఱసాలలో చాలబాధలకు గుఱియైరి. వారి యాహారము సరియైనిది కాదు. తలకుమించిన వస్త్రము లుదుకు చాకిరి. వెలుపలినుండి యాహారముఁ దెచ్చుకొనుట కనుమతి నీయలేదు. కస్తూరిబాయి మతసంబంధమైన ప్రతిజ్ఞచేత నిర్ణీతాహారముఁ గలది. ఉద్యోగు లెంతో కష్టముపై నామె కాయాహారమొసఁగ నంగీకరించిరి. చెఱ సాలనుండి వదలిపెట్టునప్పు డామె యెముకలగూడువలె నుండెను. విశ్వప్రయత్నముపై బ్రతుకఁగలిగెను. నాఁడు స్త్రీలు ప్రదర్శించిన సేవాపరాయణత్వము, కార్యదీక్ష, కష్టసహనము నేను మఱువఁజాలను. ఉద్యమము స్త్రీలు చెఱసాలకు వెళ్లుటచేఁ గొంతవఱకు బలపడినదని చెప్పఁ గలను” అన్నాఁడు. ఆ సత్యాగ్రహసమరము కొంచె మించు మించు నెనిమిది సంవత్సరములు నిరాఘాటముగ సాగినది. దక్షిణాఫ్రికాలో నివసించు ప్రతిభారతీయునికి నాపోరాటము తోటి సంబంధ ముండెడిదన్న నదియెంతటి ప్రజాభిమానము చూఱఁగొన్నదో యర్థము కాఁగలదు.

ఇటువంటి యుద్యమము—నందులో నన్యాయముఁ బ్రతిఘటింప నాధ్యాత్మికబలముతోఁ గూడుకొని జాతినంత

టికినిఁ బోరాటములోనికిఁ దింపినది ప్రపంచచరిత్రలో నశ్రుతపూర్వము. దీనిశక్తి విశ్వవ్యాప్తివంటిది. దక్షిణ-ఆఫ్రికా ప్రభుత్వము క్రిందికి దిగజాఱవలసి వచ్చెను. తత్ప్రతిఫలముగా "నమోదుచేసికొను శాసనము" నుపసంహరించుకొనెను. కొన్నివిధములైన పన్నులు తీసివేసిరి. రెండవ వివాహము శాసనరీత్యా గుఱుతింపఁబడెను. సత్యాగ్రహము యొక్క నైతికవిజయమెంతైనఁ జెప్పఁకొనఁదగినది. అంతకు ముందు భారతీయులుగోల్పోయిన సాహసము, నాత్మగౌరవము పునరుద్ధరించెను. వారిని తెల్లవారిదృష్టిలో మాత్రమె పడునట్లుగాక ప్రపంచదృష్టిలోను బడునట్లు గావించినది. బలహీనుల కిదియొక గొప్ప విజయమునుసాధించు నాయుధమైనది. మానవజాతి సంఘర్షణము నడ్డుకొనుశక్తి సత్యాగ్రహమునకు లభ్యమైనదనవచ్చును.

ఆపోరాట మొకజాతిపై నొకజాతి నడిపినట్టిది. అది మరణసదృశము. అయినను సంకుచితభావముగాని, ప్రత్యపకారోద్దేశ్యముగాని, క్రోధపూరితముగాని కాదు. మహాత్మునిలోఁగల గొప్పతన మెట్టిదో సకలప్రపంచమున కర్థమైనది. ప్రథమప్రపంచ మహాసంగ్రామము 1914వ. సంవత్సరములో మొదలైనప్పుడు బ్రిటిషువారిదృష్టిలో మహాత్ముఁడు సముచితస్థాన మాక్రమించినాఁడు. "భారతీయులు తమ బాధ్యతను నిర్వహించుటయందు వెనుకడుగు వేయరాదు. యుద్ధములో యథాశక్తి బ్రిటిషువారికిఁ దోడ్పడవలయు" ననియు నుద్ఘాటించెను. ఒకరంగములో బ్రిటిషువారిని

శత్రువునకుఁ బరిగణింపవలసి వచ్చినను, వేఱొకరంగమందు వారికి విపత్తుసంభవించినప్పుడు 'సత్యాగ్రహిక సహకార' మొసఁగవలెనని గాంధిజీ యభిప్రాయము. ఇట్టియౌదార్య మనితరసాధ్యముకదా?

దక్షిణ-ఆఫ్రికాలో తాను జేయవలసిన కార్యక్రమము సంపూర్ణమైనదని గాంధిజీ తలంచెను. అచటి భారతీయుల నందఱను సంఘటితపఱచి, వారికి సత్యాగ్రహమును నేర్పి, అహింసాపూరితమైన పోరాటమునకు దారిచూపెను. ఇఁక మీఁద నా విధానముల ననుసరించు బాధ్యత వారిదే. అన్ని కట్టుదిట్టములను గావించి భారతదేశమునకు 1915 వ సంవత్సరమునఁ దిరిగి వచ్చెను. ఆరాకలోఁ గల మహోద్దేశ్యము జర్మనుయుద్ధమున మునిఁగి, కడతేఱుటకై విశ్వప్రయత్నము లొనర్చుచున్న ఆంగ్లేయులకు సహకరింప భారతీయులఁ బ్రోత్సహించి, తత్సహాయఫలితముగ మాతృదేశ దాస్య విముక్తికిఁ బాటుపడుట. ఎటులైననేమి భారతక్షోణి నక్షతలు చల్లినాఁడు మహాత్ముఁడు.

నాఁటి భారతదేశము నిర్వీర్యము. విజాతిపాలనలోని యమయాతనలకు గుఱియై స్వకీయవైశిష్ట్యమును గోల్పోయి, యధఃపతితమై యుండెను. యుగములతరబడి పారంపర్యాగత స్వచ్ఛంద జాతీయజీవన ముడుగంటినది. ప్రతిభానుషంగిక మైన భారతవిజ్ఞాన మడవులపాలైన దనవచ్చును. భారత వీర్యము నివురుగప్పిన నిప్పువలె నుండెను. 1857 వ సంవత్సరములో జరిగిన 'సిపాయి తిరుగుబాటు'నందలి నిగూఢ

మాతృదేశ స్వతంత్రగానము ప్రజల శ్రవణపుటములలో మార్మ్రోఁగుచునే యున్నది. జాతీయభావము లచ్చటచ్చట వెదచల్లబడి యంకురించినవి. యువకులలో నొక నూతనోత్తేజము, కార్యదీక్ష యొకవైపు ముప్పిరిగొనుచుండెను. ప్రజల యార్థికజీవన మన్నివిధముల నిరాశాజనకమే! వీని కన్నింటికిఁ దోడుగ ఐరోపాఖండమందు యుద్ధప్రజ్వలనము. దేశమంతయు నొకవిధమైన యశాంతితోఁ గూడుకొన్నది. స్వాతంత్ర్యోద్యమప్రయత్నము లచ్చటచ్చటఁ దలయెత్తినవి. దేశప్రజల నందఱి నేకముఖముగ నడిపింపఁగల విశాలసంస్థ యొక్కటియు లేదు. జాతీయమహాసభ స్థాపితమై (1885 నుండి) ముప్పదిసంవత్సరములైన నది నాయకుల కొక యుపన్యాసరంగముగ నుండెనేకాని, జాతినంతటిని ప్రబోధించు ప్రజాసంస్థ కాఁజాలదాయె. "భారతసేవకుల సంఘము" (Servants of India Society) కొంతకుఁ గొంత కార్యదీక్షతోఁ బనిచేయసాగెను. ప్రభుత్వమన్న జనులకు మహాభయము. అధికారుల నిరంకుశత్వమునకు వెఱచి సత్యముఁ జెప్పుటకైనఁ బ్రజలు వెనుకాడువారు. ప్రభుత్వపు దయాధర్మభిక్షకై కొందఱు పెద్దమనుష్యులు మాతృదేశమున కెట్టియపకార మొనర్చుటకైన సిద్ధమైరి. అవినీతి, నిరంకుశత్వము, ప్రభుతాగర్వము పరిపాలకులైన తెల్లవారిలో విశృంఖల తాండవనృత్యము లొనర్చెడివన్న దేశముయొక్క పరిస్థితులు, ప్రజాజీవన మెట్లుండునో గమనింపవచ్చు.

ఇట్టి వాతావరణములో గాంధిజీ భారతదేశముపై నడుగిడివాఁడు. బొంబాయి రేవులో దిగుటతోడనె స్థానికు

లాయనను సగౌరవముగ నాహ్వానించిరి. ఒక బ్రహ్మాండమైన స్వాగతసభ గావింపఁబడినది. భారతదేశములో సత్యాగ్రహమునకుఁ దొలి బీజ మచటనే పడెను. గాంధిని ప్రశంసించుచు మాట్లాడినవారెల్ల నాంగ్లమున నుపన్యసించిరి. కడుధైర్యముతో వారి మెచ్చుకోలున కంత గుజరాతిభాషలో సమాధాన మొసంగి, కృతజ్ఞతఁ దెలిపెను. నాఁడు గాంధికి స్వాగత వాక్యాలు పలకినవారిలో జనాబ్ మహమ్మదాలీ జిన్నా కూడ నొకఁడు. గాంధి గుజరాతి భాషలో సమాధాన మొసఁగుటఁజూచి యందఱు నాశ్చర్య చకితులైరి.

తెల్ల దొరలకు గాంధికి యెవ్విధముగనైన సన్నిహిత పరిచయము. దక్షిణ-ఆఫ్రికాలో జరిపిన సత్యాగ్రహముతో నాంగ్లేయుల కందఱుకు గాంధినామము శ్రుతపూర్వము. అట్టియెడ భారతదేశములోనున్న యున్నతోద్యోగులగు తెల్లదొరలకి తెలియదా? గోఖలే మహాశయుఁడు గౌర్నరును జూడవలసినదిగా గాంధి కొక వార్త పంపియుండెను. ఆ విధముగనె బొంబాయి గౌర్నరగు లార్డు విలింగ్డను దర్శించుటకు గాంధి వెళ్ళెను. సంభాషణ ముగిసిన పిమ్మట విలింగ్డను "మీరు నా కొక వాగ్దాన మొసఁగుఁడు. ప్రభుత్వమునకు సంబంధించి, యే యాందోళనమునైన మీరు చేయఁదలచినట్లైన మొదట నాతో మాట్లాడి తరువాత చేయుఁడు." అనెను. అందులకు గాంధి "నేను సత్యాగ్రహిని. నాతత్వమె యట్టిది. మొదట మీ యుద్దేశ్య మెఱిఁగి, మీ కనుకూలముగ నుండుటకు ప్రయత్నింతును. దానిని గుఱించి తా మేమియు బెంగ పెట్టుకొన నవసరము లే"దని చెప్పి, యొప్పించెను.

గోఖలేగారి యాజ్ఞను బాలింప గాంధి వెంటనే పూనా కరిగెను. గోఖలేగారును, వారిసంస్థలోని సభ్యులును గాంధిపై యవ్యాజానురాగము కురిపించిరి. అందఱు గలిసి యనేకవిషయములు చర్చించుకొనిరి. గాంధి తమ సంస్థలో చేరిపోవలయునని గోఖలేగారి యభిమతము. గాంధి కది యిష్టమున్నను మిగిలిన సభ్యులలోఁ గొందఱ కది యయిష్టము. వారిసంస్థ యాదర్శములలోఁ, గార్యవిధానములలోఁ గొన్నింట గాంధి కభిప్రాయభేదములు గలవు. గోఖలేగారీవిషయములు గుర్తించి "మీరు సభ్యులుగఁ జేరినను, జేరకున్నను మీరు మాసంస్థకు విశ్వాసపాత్రులు. ఆ కారణముచే మా యభిమానమున కేమాత్రము లోపముండ"దన గాంధి సంతోషించి, "ఫినిక్స్" ఆశ్రమమునుండి భారతదేశమున కేతెంచిన పరివారము విషయమై ప్రస్తావించుచు, "నే నొక యాశ్రమము నేర్పఱచి వారల నందుంపఁగోరుచున్నాను. గుజరాతులో జన్మించినవాఁడ నగుటచే నాశ్రమమందె స్థాపించి, యచటినుండియె దేశసేవచేయఁ దలపెట్టితి" ననియెను. గోఖలేగా రామాటల కెంతైన సంతోషించి "మీరు చెప్పినట్లె చేయుఁడు. వలసినధనమును నే నొసఁగుదును. దాని నాశ్రమమును నాదిగ భావించి ప్రేమింతు"నన గాంధిజీ సంతోషితాంతరంగుఁడయ్యెను. చందాలు ప్రోగుచేయు భారము తప్పినదనియు, మంచి కష్టకాలములో నుత్తమమార్గదర్శకుఁడు లభించెననియు భావించెను.

అచటినుండి శాంతినికేతనమునకు వెళ్ళఁదలఁచెను. ఇంతలో నన్నగారు చనిపోయినారన్నవార్త తెలిసినది.

వెంటనే బొంబాయికి వెళ్ళి, వదినెగారిని, తదితర బంధువులను దర్శించుటకై రాజకోట పోరుబందరులకు పోయెను. విదేశములలోఁ దాల్చు దుస్తులు పనికిరావని గాంధిజీకి తోఁచెను. ఆ దుస్తుల యాడంబరము మూఁడవతరగతి రైలుపెట్టెలోఁ బ్రయాణించువానికొక బాధాజనకముగా నుండెను. అందుచే ధోవతిఁ గట్టుకొని, కుడితి, కాశ్మీరపు టోపిని ధరించినాఁడు. మూఁడవ తరగతి ప్రయాణికుల కష్టసుఖములు గాంధికి బాగుగఁ దెలియవచ్చినవి.

శాంతినికేతనమునకుఁ బయనమై వెళ్ళెను. నిరాడంబరతను, శిల్పమును, ప్రేమను మేళవించి యచటి యధ్యాపకులు, విద్యార్థులు గాంధిగారికి స్వాగత మొసఁగిరి. యచట పెద్దలందఱితోఁ బరిచయ భాగ్యము కలిగినది. "ఫినిక్స్" ఆశ్రమవాసులు ప్రత్యేకముగ నేర్పాటు చేసిన బసలోనుండిరి. గాంధి విద్యార్థులతోడ, నధ్యాపకులతోడఁ గలిసిమెలసి వారల కత్యంత ప్రేమ పాత్రుఁడైనాఁడు. వారితో దేహపరిశ్రమ. తన పనిని తానే చేసికొనుటలోఁ గల విశేషములను జర్చించుచు, తమ పాకమును దామె చేసికొనుచో నుత్కృష్టమనియు, విద్యార్థులొక నూత్న విషయ మెఱిఁగినవారగుదురనియుఁ జెప్పెను. అధ్యాపకు లంగీకరించిరి. విద్యార్థులు నూత్నవిషయముల కుత్సాహప్రియులుగదా! రవీంద్రునికిఁ జెప్ప నాతఁడంగీకరించెను. కొంతకాలము శాంతినికేతనములో నీ పద్ధతియె కొనసాగినది.

గోఖలేగారు మరణించిరన్నవార్త పిడుగుపడిన ట్లయ్యెను. శాంతినికేతనమంతయు దుఃఖముతో మునిఁగిపోయినది. నాఁడే గాంధి, కస్తూరిబాయితోఁగూడ పూనాకు బయలుదేరెను. పూనా చేరుకొనిరి. "భారతసేవకుల సంఘము" సభ్యులతోఁబాటు గోఖలేగారి యుత్తరక్రియలలో గాంధి పాల్గొనెను. తరువాత సంస్థలో సభ్యత్వము గాంధికీయఁదగునా, లేదా యనువిషయమై సంస్థసభ్యులలో చర్చ ప్రారంభమాయెను. గోఖలేగారి యాత్మశాంతికొఱకె గాంధిజీ సంస్థయందలి సభ్యత్వ మాశించెను. పెద్దలలో నెన్నియభిప్రాయభేదము లున్నను వారి యాదర్శములొకే గమ్యస్థానము నాశించెడివి. వ్యక్తులభావములు గౌరవించుట విద్యావంతుల ధర్మము. సంస్థలోని సభ్యత్వము పరిగణింపఁదగిన విషయముగాదు. అందుచేత గాంధి వారిసంస్థలో సభ్యత్వముఁ బొందకున్నను వారి యాదర్శములపట్ల గౌరవ, విశ్వాసములు కలిగియుండెను. సంస్థసభ్యులుగూడ గాంధిగారి కార్యప్రణాళిక, సిద్ధాంతముల గాఢముగఁ బ్రేమించుచుండిరి. 'లౌకికదృష్టితోఁ జూచిన యాసంస్థలో సభ్యుఁడు గాకున్న నాధ్యాత్మికదృష్టిలో సభ్యుఁడనే' యని గాంధి యంగీకరించియె యున్నాఁడు. అందుచే సంస్థ—గాంధి మధ్య గాఢసంబంధ మేర్పడిపోయినది.

డా. ప్రాణజీవనదాస్‌తో మాట్లాడుటకై గాంధి రంగూన్ వెళ్ళఁదలఁచెను. కలకత్తాలో దిగి, యచటఁ గొంతకాలముండి, రంగూన్ చేరుకొనెను. 1915 వ. సంవత్స

రములో హరిద్వారమునందు జరిగిన కుంభమేళమును దర్శించుటకై గాంధి కలకత్తాకువచ్చి, హరిద్వారమునకు రైలులోఁ బ్రయాణమయ్యెను. అచటిచేరి యొకడేరాలోఁ బసచేసెను. అప్పటికి దక్షిణ - అఫ్రికాలో గాంధిజీసల్పిన సత్యాగ్రహము, శాసనోల్లంఘనముల మూలమున భారత దేశములో నాయనపేరు చాలమందికి తెలిసిపోయినది. హరిద్వారము కుంభమేళమునకు గాంధిజీ వచ్చినాఁడని విని యాత్రికులంద ఱాయనఁజూడ తండోపతండములుగ డేరా కడకు వచ్చుచుండిరి. వారికి దర్శనమిచ్చుచు, ప్రసంగించుచు నొక్కనిముసమైన విశ్రాంతిలేకనె కాలముగడపెను.

గాంధిజీ హరిద్వారయాత్ర ముగించుకొని వచ్చునప్పు డాయన మనసులో "ఫినిక్స్" ఆశ్రమమువంటి దాని నొకటి స్థాపింపవలయుననువాంఛ గాఢతరముగ నుండెను. పలువురు మిత్రులతో నావిషయమై ముచ్చటించెను ఒక్కొక్క రొక్కొక్క ప్రదేశమందుండమని కోరిరి. అమదాబాదు మీఁదుగఁ బయనము సాగించునప్పు డచటి మిత్రులువచ్చి, ఆశ్రమమున కగు ధనమిత్తుమనియు, నివసించుట కిండ్లిత్తు మనియుఁ జెప్పిరి. వారిమాట లాయనకు నచ్చినవి. తాను గుజరాతువాఁ డగుటచే గుజరాతు దేశముననే నివసించి దేశ సేవచేయుట ముఖ్యమనుకొనెను. అందులో నమదాబాదు గుజరాతునకు ముఖ్యనగరము. ఆమాత్రమెకాక చేతిమగ్గ ములకుఁ గేంద్రము. రాట్నములు పెట్టించి, పనిబాగుగ సాగింపవచ్చునని యెంచెను. అమదాబాదులో గొప్పధనికులు

కలరు. వారిచ్చు ధనముతో నాశ్రమము నిరంతరాయముగఁ గొనసాగఁగలదని నమ్మెను.

గాంధి మనస్సులో మాట దాఁపఁడు. ఉన్నదున్నట్లు చెప్పెను. ఆశ్రమములో హరిజనుఁ డెవఁడేని ప్రవేశింప వచ్చిన చేర్చుకొందునని మొదటనే వారలకుఁ దెలియఁ జెప్పెను. జీవనలాల్ దేశాయి బారిష్టరు వారి "కొచరబ్" గృహము నద్దెకుఁదీసికొని యందుండిరి. అప్పు డాశ్రమమున కేమి పేరుపెట్టవలయునా యని మిత్రుల సలహా నడిగెను. సేవాశ్రమమనియు, తపోవనమనియు నొక్కొక్కరొక పేరును సూచించిరి. గాంధి కవియేవియు నచ్చవాయెను. ఆయన యుద్దేశ్యము సత్యమును బూజించుటయు, శోధించుటయు, దీక్షతో నడుపుటయు. అందుచే దానికి 'సత్యాగ్రహాశ్రమ' మని నామకరణ మొనర్చినాఁడు.

ఆశ్రమమున కొక నియమావళి సంసిద్ధ మొనర్పఁబడి నది. ఇరువదియైదుగురితో నాశ్రమముండెను. వారికందఱకు నొకటియె పాకశాల. ఏకకుటుంబమువారివలె నందఱుఁ గలిసిమెలసి జీవింపసాగిరి.

ఒక హరిజనకుటుంబ మాశ్రమమునకు వచ్చిచేరెను. వా రానియమముల నక్షరశః అనుసరింతుమనిరి. దానితో నంతవఱకు నాశ్రమమున కార్థికముగ సహాయమొనర్చు వారిలో నొకవిధమైన యాందోళనము కలిగెను. గృహము వారి కందుఁగల నూతి లోభాగము. దానిచే నాశ్రమవాసులు నీరు తెచ్చుకొనుట కిబ్బంది యేర్పడెను. ఆ యింటి పనివాఁ

జా వచ్చిన హరిజనుల నొకరీతి తిట్టుటకు సాహసించెను. గాంధి యదిచూచి వాఁ డెంత తిట్టినను, మరల తిట్టవలదని, నీరు తెచ్చుట మానకుఁడని తెలిపెను. కడకు వాఁడే తిట్టుట మానుకొనవలసివచ్చినది. ఆశ్రమములో హరిజనప్రవేశము వల్ల ధనసహాయము నిలిచిపోయినది. దానివెంట సంఘ బహిష్కారము రాఁబోవునని గాంధి తలఁచినాఁడు. ఏపరిస్థితు లలో నహమదాబాదు విడువఁదగదనియు, మాలగూడెమునకై వెళ్ళి పనిపాటలు చేసి కూలిసంపాదించుకొనియైనను బ్రతుక వలయుననియు వెంటనున్నవారికిఁ జెప్పి యొప్పించెను. కష్ట ములకు కాకతేఱినవాఁడు గాంధి. ఆయనజీవితములో నిట్టి వెన్నియొ తటస్థించినవి—సాహసముతో నెదుర్కొన్నాఁడు.

ధనాభావముచే నా స్థలమును వదలిపెట్టి, మాల గూడమె చేరవలెనని గాంధి సంసిద్ధమగుచుండెను. ఒకనాఁ డొక బాలుఁడువచ్చి, ఆశ్రమముముందు రోడ్డుపై మోటారు కారు వచ్చి నిలబడిన దనెను. గాంధి యచటికి వెళ్లెను. ఒక సేటు సుఖాసీనుఁడై, గాంధిపై ననురాగవర్షము కురి పించుచు, "నే నాశ్రమమునకుఁ గొంత ధనసహాయము చేయఁ దలఁచితిని. తాము స్వీకరింతురా?" యనియెను. వెదుకఁ బోయిన తీఁగె కాలికే తగిలినట్లు ధనాభావముచే శ్రమపడు చున్న గాంధి "అంతకన్న వేఱొండుభాగ్యము కలదా? చాల నవసరముగూడనున్న" దనెను. తేపు ప్రొద్దున వత్తునని సేటు వెళ్ళినాఁడు. అన్నట్లు మఱునాఁడు వచ్చి గాంధిజీ చేతికి 13000 వేల రూపాయిలిచ్చి, మాటపలుకకుండ పోయెను.

ఈ సంఘటన గాంధికి విభ్రమాస్పదమయ్యెను. అంతగఁ బరిచయములేని వ్యక్తి ఒకేమా ఱింత ధనమిచ్చుట? కనీస మొక సంవత్సరమైన నా ధనముతోఁ గాలక్షేపము చేయ వచ్చునని భావించినాఁడు. ఇప్పుడు మాలగూడెమునకు మార్చు నుద్దేశ్యమునుండి విరమించికొనియెను.

---

# ద్వితీయ భాగము

## ౧

లక్నోలో కాంగ్రెసు సమావేశము జరిగెను. గాంధి కూడ వెళ్ళినాఁడు. అచటికి రజకుమారశుక్ల యను నతఁడు వచ్చి గాంధిజీని చంపరానుకు వచ్చి తమ కష్టసుఖములను జూచి పోవలసినదిగా విన్నవించెను. అన్నివిషయము లర్థ మగునట్లు చెప్పించుటకు బీహారులో ప్రసిద్ధన్యాయవాదియగు బ్రజకిశోరబాబును గాంధిచెంతకుఁ బిలుచుకొనివచ్చెను. ఆయన పూసగ్రుచ్చినట్లు రైతుల కడగండ్లు తెలిపినాఁడు. అంతయు సావధానముగా విని "నేను స్వయముగఁ జూడనిది నా యభిప్రాయమును వ్యక్తమొనర్పఁజాలను. కాంగ్రెసునం దీవిషయమై ప్రస్తావింపుఁ" డనియెను. ఆ సలహాప్రకారమె బ్రజకిశోరబాబు నాఁటి కాంగ్రెసు సమావేశములో చంప రాను రైతులనుగుఱించి యుపన్యసింప, నాసమస్య యందఱు సానుభూతిఁ బొందెను.

చంపరాను గంగానది కుత్తరతీరమునఁ గలదు. హిమాలయపర్వతప్రాంతము. నేపాళమునకును మార్గము. అచట నీలిమందు తోఁట లుండెను. అచట ప్రతియొకరైతు చేసికొనుభూమిలో నిరువదిపాళ్ళలో మూఁడుపాళ్ళ భూమి యందు స్వంతదారునికిఁ (భూస్వామికి) నీలిమందు వేసితీర వలయునని చట్టము గలదు. దీనికే† "తీఁకఠియా" యందురు. గాంధి కంతకుముందు నీలిమందు పండింపఁబడునను విషయము గాని, చంపరాను పేరుగాని తెలియదు. దానిమూలముగా రైతు లనేకబాధలకు గుఱియగుచున్నారనియు నెఱుఁగఁడు. చంపరాను రైతు రాజకుమారశుక్ల భూస్వాములవల్ల చాల కష్టముల ననుభవించి, తనతోడిరైతుల నీకష్టములనుండి యుద్ధరింపవలయునని ప్రయత్నించుచున్నాఁడు. నిరక్షరాస్యుఁడు, అమాయకుఁడు. కల్లకపటములులేని రైతు.

రాజకుమారశుక్ల మరల గాంధి చెంతకువచ్చి "తాము స్వయముగ నేతెంచి మా కష్టములఁ జూడవలె" నని ప్రార్థించెను. అవకాశము లభించినప్పుడు రాఁగలనని గాంధి చెప్పెను. శుక్ల వదలలేదు. ఆయన యెచటికిఁ బోయిన నచటనె ప్రత్యక్షము. ఒకనాఁడు నిర్ణయించి కలకత్తాలో వచ్చి కలిసికొమ్మన శుక్ల యటులనే చేసెను. ఇర్వురును పాట్నాకు వచ్చి చేరిరి. రాజేంద్రబాబుగారింట బస. వారు గ్రామాంతరమునకుఁ బోయినారు. సేవకులు గాంధిగారి

† ఇరువదికఠియా లొక యెకరము. ఇరువదిపాళ్ళలో మూఁడు పాళ్ళు చేయవలసినందున నా పేరు వచ్చెను.

జాతి తెలియకఁ బోవుటచే ననుమానించి, దూరదూరముగఁ బోవుచుండిరి. ఇట్టి యనుభవములు గాంధి కొంటఁబట్టినవి. వాని కాశ్చర్యము కాని, రోఁతకాని కలుగుటలేదు. అమాయకుఁడైన శుక్ల తన కంతగ తోడ్పడలేడని యెఱిఁగి గాంధి స్వయముగనె ప్రతివిషయ మాలోచింపసాగెను.

లండనులో సమకాలికుఁడైన యొక స్నేహితుఁడు కనిపించెను. ఆయన యాతిథ్యమును స్వీకరించి, ముఝపర్ పూర్‌కు ప్రయాణమై వెళ్ళెను. అప్పుడక్కడ ఆచార్య కృపలానీగా రుండిరి. వారిని హైద్రాబాదుకు (సింధులోనిది) వెళ్ళినప్పటినుండియు నెఱుఁగును. గొప్ప త్యాగము, పవిత్ర జీవనము గలవారు. ప్రభుత్వ కళాశాలలో నాచార్యులుగా నుండి, యప్పుడప్పుడే దేశసేవ చేయుటకై యుద్యోగమును వదలుకొనిరి. వారి మిత్రునింట గాంధి బస చేసెను. కృపలానీ గారు బీహారు పరిస్థితులను, దాను వచ్చినపని యెంత కఠినమైనది చక్కఁగ వివరించి గాంధిగారికి చెప్పిరి. చాలమంది స్థానిక న్యాయవాదులు, మఱికొందఱు పెద్దలువచ్చి కలిసికొనిరి. వ్రజకిశోరబాబు, రాజేంద్రబాబు వచ్చి కలిసికొన్నారు. వారి నిరాడంబరత్వము, యోగ్యత, నమ్రత, విశ్వాసము గాంచి గాంధి యాశ్చర్య చకితుఁడయ్యెను. వ్రజకిశోరబాబు పేదరైతుల పాలిటి న్యాయవాదియైనను వ్యాజ్యమాడు వారినుండి "ఫీజు" చాల యెక్కువగ పుచ్చుకొనుచుండెను. ఆయన చంపరాను రైతులకు సంబంధించిన పూర్వాపర సందర్భము లన్నింటిని వివరించినాఁడు. అందు

లకు గాంధి "న్యాయస్థానముల కెక్కుట నిష్ప్రయోజనము,
రైతులలో భయము పోఁగొట్టవలయును. ఈ "తీన్ కఠియా"
విధానము నశించునంతవఱకు నిదురపోరాదు. ఎన్నేండ్లయి
నను నే నీపని చేసియే తిరిగిపోయెదను. మీ సహాయము
నాకెంతో యవసరము. వ్రాయసకాఁడు,దుబాసి కావలెను
సమయమువచ్చుచో చెఱసాలకు సిద్ధముగ నుండవలెను."
అనఁగ వ్రజకిశోరబాబు వెంట వచ్చిన మఱికొందఱు న్యాయ
వాదులు న్యాయవాదివృత్తిని మానుకొని, యచటనే
యుండుటకు, నవసరమగుచో చెఱసాల కేగుటకును వాగ్దాన
మొసంగిరి.

గాంధిజీ మహాకార్యభారమును నిర్వహింపవలసివచ్చి
నది. వేలకొలఁది రైతులను గలిసికొనవలెను. అంత సులభ
సాధ్యమైన పనికాదు. వారిని కలిసికొనుటకుముందు భూస్వా
ముల సంఘము కార్యదర్శిని చూచినాఁడు. ఆయన "మీ రీ
దేశమువారుకారు. మాసంగతులతోఁ బ్రమేయమేల?
ఏమయినను వ్రాసిపంపుఁ" డన గాంధి "నేను పరదేశిని
కాదు. రైతు లడిగినపుడు వారి మంచిచెడ్డ లెఱుఁగుటకు
నాకు సంపూర్ణాధికారము కల" దనెను. స్థానికోన్నతో
ద్యోగిని కలిసికొనఁగా నతఁ డా స్థలము నె వదలిపొమ్మని
యెను సహచరులతో నీవిషయములన్నియు సంప్రతించి
చంపారన్ ముఖ్యపట్టణమైన మోహాతీకి బయలుదేఱి వెళ్లి
నాఁడు. గోరఖబాబుగారు గాంధి కాశ్రయమిచ్చెను. ఆ
యిల్లొక ధర్మసత్రముగ మాఱిపోయినది.

మోతీహారికి సమీపమునఁగల యొక గ్రామములో నొకరైతున కన్యాయముజరిగినదని విని యచటికి మఱునాఁటి యుదయమే ప్రయాణమైరి. ఆ చంపారణ్యములో నేనుఁగుమీఁద ప్రయాణము. మార్గమధ్యముననె పోలీసు అధికారి సేవకుఁడు "చంపరాను విడిచిపో" మ్మను నాజ్ఞగల యొక నోటీసుని చేతికిచ్చెను. దాని నకలుపై చేవ్రాలు పెట్టుమని వాఁడు చెప్పఁగ, గాంధి "ఇచ్చటి పరిస్థితులన్నియుఁ దెలిసికొనక చంపరాను విడిచిపోను" అని వ్రాసి చేవ్రాలు చేసెను. మఱుసాఁడు "పోలీసు అధికారి యాజ్ఞనుల్లంఘించినందులకు విచారణ చేయఁబడును. తేపటిదినము హాజరుకావలసియున్న" దను పత్రమొకటి వచ్చెను. నాఁడు రాత్రియంతయు మేలుకొని వ్రాయవలసిన యుత్తరములన్నియు వ్రాసి, చెప్పవలసినవారల కన్నిసంగతులను గాంధి చెప్పినాఁడు.

గాంధి న్యాయస్థానములో విచారింపఁబడుననువార్త యూరంతయుఁ దెలిసిపోయెను. జనులు గుంపులుగుంపులుగ గాంధి చుట్టుముట్టిరి. కలెక్టరు, మేజిస్ట్రేటు, సూపరింటెండెంటులు గాంధిగారికి యిబ్బందులు కలిగింపక సరిగనె చూచుకొనిరి. తండోపతండములుగ ప్రభుత్వ న్యాయస్థానమునకు వచ్చు జనుల సర్దుబాటుకు వీరి సహకారమును బాగుగ విని యోగించుకొనిరి. క్రొత్తగ వచ్చినట్టి గాంధికి ప్రజలపై నింతటి యధికారము సంప్రాప్తించుట, తమకున్న యధికారము మటుమాయమౌట నధికారులు కనులార

గాంచిరి. ప్రజల కాసమయమున ప్రభుత్వభయమే లేదాయెను. అంతకుముం దచటి ప్రజలు గాంధి నెఱుఁగరు. ఆపద్బాంధవుఁడుగ తమ సన్నిధికి వచ్చిన యీ మహాపురుషుని గుణగానము వారి చెవుల నప్పుడప్పుడె పడెను.

చంపారణ్యములోని ప్రజ లాప్రదేశమును దప్ప బహిఃప్రపంచముతో నెట్టి సంబంధబాంధవ్యములును లేని వారు అయినను గాంధిని తమ చిరకాలమిత్రునివలె సౌహార్దముఁ బ్రదర్శించి గౌరవించిరి. ఆ మహాప్రజాసమావేశమును గాంధి యీశ్వరసాక్షాత్కారముగ భావించినాఁడు. వారి నెవ్వరుఁ బిలిచినవారు లేరు. తమతమ పనిపాటులుమాని, తదేకధ్యానముతో, ప్రభుత్వమున కేమాత్రము జంకు గొంకులులేక వచ్చుటలో నేదోయొకశక్తి వారిహృదయములఁ బ్రేరేపించినదని గాంధిజీ నిశ్చయము. అదియే అహింసాసాక్షాత్కారమనియు, సత్యసాక్షాత్కారమనియు గాంధి నమ్మెను. ప్రజలకుఁ దనయెడఁగల ప్రేమయె యీ యాకర్షణమునకు మూలకారణము. ఆప్రేమకూడ నహింసపైఁ దనకున్న గాఢవిశ్వాసమేయని గాంధి సిద్ధాంతీకరించుకొనెను. తనజీవితములో నాదినము మరువరానిదిగాఁ దోఁచెను,

విచారణ మొదలైనది, తాను ప్రభుత్వాజ్ఞను దిరస్కరించుటకుఁగల కారణములను వివరించుచు గాంధి వాఙ్మూల మిచ్చెను. అందులో "దేశసేవ, ప్రజాసేవఁ జేయు నుద్దేశ్యముతో వచ్చినాను. నీలిమందు కామందులు పేదరైతుల కన్యాయముఁ జేయుచున్నందున, రైతులు నన్నువచ్చి తమ

పరిస్థితులు పరిశీలించి, బాగుపఱచకోరిరి. అందులకు ప్రభుత్వముయొక్క, భూస్వాములయొక్క సహాయముగూడ కోరఁదలఁపుగలదు. నారాకచే శాంతిభంగముకాని, ప్రాణాపాయముగాని లేదు. ప్రభుత్వము తమసేవకుల మాటలు నమ్మి నాకుఁబంపిన యాజ్ఞాపత్రము న్యాయబద్ధము కానందున నే నందులకు బద్ధుఁడను గాకపోయితిని. భారతదేశప్రజలెచటనున్నవారైనను వారిక్షేమమునుగూర్చి ప్రయత్నించుటయె నావంటివాని ధర్మము, అందులకు భిన్నముగనున్నందునని ప్రభుత్వాజ్ఞ నుల్లంఘింపవలసి వచ్చినవాఁడనైతిని. వేఱొండుకాదు. నాకు విధింపఁబోవు శిక్ష తక్కువకావలెనని నే నిట్లుచెప్పుటలేదు. ప్రభుత్వాధికారులయెడ గౌరవము లేక నే నీయాజ్ఞ నుల్లంఘింపలేదు. నాయంతరాత్మ ఆజ్ఞవలన నట్లుచేసితిని." అని గాంధి తెలిపెను. న్యాయాధికారి, ప్రభుత్వన్యాయవాది యేమి దిక్కుతోఁపక, వాయిదావేసిరి. ఆ యవకాశము నుపయోగించుకొని గాంధి జరిగినసంగతి నంతయు రాజప్రతినిధికి, పాట్నాలోని స్నేహితులకు, పండిత మదనమోహన మాలవ్యాకుఁ దెలిపినాఁడు. మరల న్యాయస్థానమునకుఁ బోవలసినదినమునకు ముందె "అభియోగము నెత్తివేసికొనవలసినదని గవర్నరు ఆజ్ఞాపించెను. ఆ విషయమును విచారించుకొనుఁడు. ప్రభుత్వోద్యోగులు మీకుఁ గావలసిన సహాయములు చేయఁగల"రని కలెక్టరొక యుత్తరముఁ బంపెను. గాంధి యింతత్వరలో నిట్టిమార్పు కలుగునని తలఁపఁడాయెను. అందుచే నాశ్చర్యపడినాఁడు.

గాంధి కలెక్టరును దర్శించెను. ఆయన చాల నుత్త ముఁడుగఁ దోఁచెను. "మీరు కోరిన కాగితములఁ జూచుకొనవచ్చును. అవసరమనుకొన్నపుడెల్ల నన్నుఁ జూడవచ్చు" నని చెప్పెను. భారతదేశములో ప్రప్రథమ సత్యాగ్రహము. మొదటి రాజకీయాజ్ఞోల్లంఘనము. పత్రిక లీ చంపరాను వార్తలను బ్రకటించుటలో నెక్కువశ్రద్ధ కనఁబఱచెను. చాల వ్యాఖ్యానములు చేయఁబడినవి. తలవనితలంపుగ దేశములో నఖండప్రచారము జరిగినది. ఇందుచేత అసలు కార్యక్రమమున కేమైన భంగమువాటిల్లునేమోనని గాంధి యనుమానించెను. ప్రభుత్వమువారు చూపిన యవ్యాజానురాగము భూస్వాములకు వెగటుగఁ దోఁచెను. వారు తమకుఁ గల పలుకుబడినంతయు వినియోగించి యధికారులను మార్పఁ బ్రయత్నించిరి. సాధ్యముకాలేదు. తుదకు నుద్యమమును నడిపింపఁ బూనుకొన్నవారిని తిట్టుటకు మొదలిడిరి.

ఒకవంక సంఘసేవ, మఱియొకవంక రైతుల వాఙ్మూలముల స్వీకరణ నిరాఘాటముగ సాగుచుండెను. రైతులు వేల సంఖ్యలోవచ్చి గాంధికి వాఙ్మూలము లిచ్చుచుండటను గాంచెడు భూస్వాములకు కనుగుట్టైను. గాంధి విచారణ సాగకుండుటకై విశ్వప్రయత్నములు చేయ మొదలిడిరి. బీహారు ప్రభుత్వమునుండి "మీరింకను గావలసిన దానికంటె నెక్కువ కాలము విచారణ సాగించినారు. ఇంక పూర్తిచేసి రాష్ట్రమును వదలిపోవరా" యను కమ్మ గాంధికిచేరెను. "నావిచారణ కింకఁ గొంతకాలముపట్టును. ముగిసిన పిమ్మటఁ గూడ

ప్రజలకష్టములు పోఁగొట్టకొనకుండ బీహారు వదలిపో" నని ప్రత్యుత్తర మంపెను. గవర్నరు తనకడకు వచ్చిచూడమని యుత్తరమును గాంధికి వ్రాసెను. వెళ్ళి మాట్లాడఁగా "చంపరాను రైతుల దుస్థితి విచారించుట కొక విచారణ సంఘమును నియమింతుము. అందు తాముగూడ సభ్యులుగ నుండఁగోరెద"నని గాంధి నడిగెను. కొన్ని నియమముల నంగీకరింప గవర్నరును గోర నాయన సమ్మతించుటచే గాంధిజీ సంఘములోఁ జేర సుముఖుతఁ జూపెను, తరువాత విచారణ సంఘ మేర్పడి, సర్వసభ్యుల సమ్మతితో నొక రిపోర్టు తయారైనది. దానిని విఫల మొనర్ప భూస్వాము లెంతయొ ప్రయత్నించిరి. గవర్నరుగారి పట్టుదలవల్ల నా "రిపోర్టు" ఉన్న దున్నట్లు ప్రభుత్వముచే నామోదింపఁబడెను. నూఱు సంవత్సరములుగ పాదుకపోయిన "తీన్ కథియా" పద్ధతి తొలఁగింపబడినది. రైతుల కష్టములా నీలిమందునకు సంబంధించినంతవఱకు తొలఁగిపోయినవి.

చంపారణ్య ప్రదేశ గ్రామములలో ననేక సంస్కరణములు చేయవలెనని గాంధి సంకల్పము, భగవంతుఁడు వేఱొక కార్యక్రమమును నిర్ణయించినాఁడు. అందుచే నాపని సాగలేదు. మరల అమదాబాదునకుఁ బ్రయాణము. భారతదేశములో గాంధికి ప్రథమ సత్యాగ్రహ విజయము లభించినది.

చంపారణ్యములో కార్యక్రమమును ముగించులోపలనె గాంధికి రెండుత్తరములు వచ్చెను. అందు నొకటి ఖేడా

(గుజరాతులో) మండలమందు పంటలు పూజ్యమైనవనియు, శిస్తును రైతులు చెల్లింపకుండునట్లుగ 'రిమిషన్' ఇప్పించ వలెననియుఁ బ్రార్థించునది. మఱియొక యుత్తరములో, అమదాబాదు కూలీలకు జీతములు తక్కువగ నుండుటచే చాలకాలమునుండి యెక్కువచేయఁ గోరుచున్నారనియు వ్రాయఁబడెను. కూలీలను సంఘటితపఱచుటలో గాంధి కెక్కువయుత్సాహము. అందుచే అమదాబాదుండి వచ్చిన యుత్తరమే యాయన నెక్కువగ నాకర్షించెను. కాఁబట్టి తక్షణమె ప్రయాణమైనాఁడు. చంపరానులోని వారికి భవిష్యత్కార్యక్రమమును వివరించి, యట్లు నడుచుకొన వలసినదిగ సలహా నొసఁగెను. మరల పనిముగించుకొని వచ్చెదననిమాత్రము చెప్పెను.

కూలివారివాదము చాల న్యాయమైనది. మిల్లు వారలకును గాంధికిని మిక్కిలి స్నేహము. అన్నింటికన్న విచిత్రసమస్య యేమన అన్న, చెల్లెలీయుభయపక్షములకు నాయకత్వము. అన్నమిల్లువారిపక్షము, చెల్లెలు కూలీల పక్షము. గాంధి కేమిచేయుటకును దోఁచినది కాదు. ఇరువురితో మాట్లాడి పంచాయతి చేయ సంకల్పించుకొనెను. ఇతరుల మధ్యస్థము నిరుపక్షము లిచ్ఛగింపలేదు. కూలివారిని సమ్మె చేయమని ప్రోత్సహించుట తప్పనిసరి యయినది. వారి పెద్దలను రప్పించి కష్టసుఖముల నన్నింటిని బోధించి కొన్ని నియమములకుఁ గట్టుబడవలయునని గాంధి తెలిపెను. శాంతిభంగము కలిగింపకుండుట, పనిలోనికిఁ బోవువారిని

బలాత్కరింపకుండుట, బిచ్చమెత్తరాదనియు, సమ్మె ముగియు వఱకు వెనుకంజవేయక, తిండికిలేకున్న నింకొక కూలిపని చేసి జీవించుటకు యత్నించుట. అందఱు కీవిషయము లర్థమైనవి. కూలివారల్లె యుందుమని శపథము గావించిరి. అప్పుడు వల్లభాయిపటేలును గాంధి యొజేఁగెను.

మొదటి పక్షము రోజులలోఁ బ్రదర్శించిన ధైర్యము, సమ్మె పొడిగించుకొలఁది కూలీలకు తగ్గఁజొచ్చెను. కొంత మంది దిగజాఱ మొదలిడిరి. పనిలోఁ జేరినవారిని సమ్మె చేయువారు ద్వేషించుటాయెను. సభ దినదినమునకు సన్న గిల్లుచుండెను. వారిలో వారికి తగవులు పడునేమోనని గాంధి భయము. ఆయన మనసులో నాందోళన మెక్కువ కాసాగెను. తానే వారిని సమ్మెకు ప్రోత్సహించినాఁడు. కీర్త్యపకీర్తులు, భవిష్యత్తు తనపైననె యాధారపడినవి. 'సమ్మె విషయము తేలునంతవఱకు నే నన్నము ముట్ట' నని మాటలలో గాంధియనెను. అందఱు దిగ్భ్రమఁ జెందిరి. కూలీల నాయకురాలు కన్నీరు కార్చ దొడఁగెను. "మాకై తామేల నుపవాసముఁ జేయవలయు? మా తప్పులన్నియు మన్నింపుఁడు." అని కూలీలు మొఱపెట్టుకొనిరి. వారి నెట్లో మాటలు చెప్పి సంతృప్తిపఱచి, భిక్షమెత్తకుండ నింకొక కూలిపని నేదైనఁ జేసికొనుమని, తా నుపవాసదీక్షను మొదలుపెట్టెను.

వల్లభాయి పటేలు కూలివారికి పురపాలకసంఘములో నుద్యోగములిప్పింప యత్నించెనుగాని కృతకృత్యుఁడు

కాఁజాలకపోయెను. మిల్లు యజమానులకు గాంధికి మైత్రి కలదని తెలిసికొంటిమి. వారికి విరుద్ధముగ నుపవాసము చేయుట సత్యాగ్రహముకాదేమోనని యనుమానము! ఏమైనను కూలీల ప్రతినిధికదా! వారలకై చేయవలసి వచ్చెను. దీనిచే యజమానుల మనస్సుల కొత్తిడి కలుగును. కూలివారు, వారి నాయకురాలు తొలినాఁడు గాంధితోపాటుపవాస ముండిరి. ఆయన బలవంతముననె మానుకొనిరి. మిల్లు యజమానుల మనస్సులు కరఁగినవి. ఏదోయొక పరిష్కారమునకువచ్చుట మేలని యెంచిరి. ఒక మధ్యవర్తి పరిష్కారమునకీ సమస్య వదలిపెట్టఁబడెను. మూఁడు నాళ్ళ కుపవాసదీక్ష యంత్యమయ్యెను. ఇరువది యొక్కనాళ్ళకు మిల్లుయజమానుల — కూలీలమధ్య సంధి కుదిరెను.

వెంటనే గాంధిదృష్టిని ఖేడామండల మాకర్షించెను. ప్రయాణముకట్టినాఁడు. సస్యములు ఫలింపలేదు. రైతులు శిస్తులకు 'రెమిషన్' ఇప్పింపుఁడని ప్రభుత్వమున కెన్నియొ విజ్ఞప్తులు పంపుకొనిరి. ఎన్నియొ రాయబారములు నడచినవి. బొంబాయి శాసనసభలో విఠలభాయి మొదలగు వా రెంతో యలజడి కలిగించిరి. అన్నియు నరణ్యరోదనములే! గుజరాతుసభకు గాంధియె యధ్యక్షుఁడు. ఆసభ విజ్ఞప్తులు, తంతులు, బంపుటయె కాక, యెన్నొవిధములఁ బ్రయత్నించెను. వానికి నధికారులకు చీమకుట్టినట్లైనఁ గాలేదు.

సహజముగ పండవలసిన పంటలో నాల్గవపాలుకన్న తక్కువపంట పండినచో రైతులు శిస్తు 'రిమిషన్' కోర వచ్చునని భూశాసనమె నొక్కి వక్కాణించుచున్నది. అధి కారులు నాలుగవపాలుకన్న నెక్కువపంట పండినదని లెక్కలువ్రాసిరి. రైతులు నెత్తిమీఁద నోరుపెట్టుకొని తక్కువపంటయని వాదించిరి. వినువారెవరు? పంచాయతి చేయుమని కోరిరి. ప్రభుత్వము తిరస్కరించెను. రాజకీయ విధానములతోఁ జేయవలసిన ప్రయత్నములన్నియు వ్యర్థ మైనపిమ్మట సహచరులతో నాలోచించి గాంధి సత్యా గ్రహముఁ జేయుటకు నిర్ణయించుకొనెను. అప్పుడు వల్లభాయి పటేలు, మహదేవదేశాయి ఆ యుద్యమములోఁ దోడ్పడుట కేతెంచిరి. ఎంతయో ధనమును సంపాదించుచు, హాయిగ న్యాయవాది వృత్తిలోనున్న పటేలు దానిని విసర్జించెను. మరల నందు ప్రవేశింపలేదు.

సత్యాగ్రహులు ప్రభుత్వమునకు ప్రతిజ్ఞాపూర్వకముగ నిట్లు వ్రాసిరి. "మా గ్రామముల నాలుగవపాలుకన్న యెక్కువపంట పండలేదు. అందువలన శిస్తు నాపుచేయవలసి నది. అట్లుగాక ప్రభుత్వమువారు దండనలతో శిస్తును రాఁబట్టుటకు ప్రయత్నించుచో మామాట నబద్ధము చేసి కొనుటకంటె భూములనె జప్తుచేయించుకొందుము. మాలో ధనవంతుల మీయఁగలిగినను పేదలు శిస్తుచెల్లింపలేరు. వారిఁగాపాడుటకై ధనవంతులముగూడ నీయఁదలపెట్టలేదు. వారిఁ గాపాడుటయె మా ధర్మమని మా విశ్వాసము" అని

గ్రామగ్రామమునుండి రైతులచేత సంతకములు పెట్టించి, ప్రభుత్వమునకుఁ బంపబడెను.

ఖేడా సత్యాగ్రహమునకు సంబంధించిన వార్తలు పత్రికలలో విశేషముగ ప్రచురితమైనవి. అందఱకు నిదియొక విచిత్రోత్సాహము గలిగించెను. గుజరాతువారు కనక వర్షము కురిపింప మొదలిడిరి. చాలు, వలదన్నను బొంబాయి సేఠులు విరివిగ ద్రవ్యమును బంపిరి. సత్యాగ్రహికి వినయ ముండవలెననియు, నదియొకటినమైనట్టియంశమనియు, గాంధి తెలిసికొనెను. వినయమన విరోధులయెడ మనస్సునం దాదరము, సమరసము, మంచికోరుటయనునదే యనియు, సత్యాగ్రహి కివి యత్యంతావశ్యకములనియుఁ దెలిపెను.

రైతులచంచల ధైర్యముఁ బ్రదర్శించిరి. ప్రభుత్వము రానురాను కఠోరవిధానముల నవలంబించి శిస్తులు రాఁబట్టుటకు మొదలుపెట్టెను. ఉద్యోగులు పశువుల, నింటిలోఁగల వస్తువుల జప్తుచేయసాగిరి. కొన్నికొన్ని గ్రామముల: బండిన పంటలనె జప్తుచేసిరి. రైతులలోఁ గొంతనిబ్బరము తక్కువయ్యెను. కొందఱురైతులు పన్నులిచ్చిరి. సాహసవంతులు పట్టుదలపై నుండిరి. ఒకపంటను జప్తుచేయుచుండ స్థలమును మార్పుమని గాంధి యాజ్ఞాపించెను. అందులకు కారకులైన యొనమండ్రుగురు వ్యక్తులపై నిర్బంధించి, తుదకు శిక్షించి చెఱసాలకంపిరి. దానితో ప్రజలకు చెఱసాలయన్న భయము తీఱిపోయెను.

జనులు దీర్ఘసత్యాగ్రహము పోరాటముచే చాల నలసిపోయిరని గాంధిజీ గమనించెను. దీనిసుఖాంతము చేయుటయే యాయనతలంపు. "ధనికులైన రైతులు శిస్తులిచ్చినచో, పేద లీయనక్కఱలే"దని ప్రభుత్వ మాజ్ఞాపించినట్లు గాంధికి తెలిసెను. ఆయాజ్ఞ నాధారముగఁగొని సత్యాగ్రహమును సమాప్తముగావించెను. ప్రజ లాయింతకె తృప్తిపడిరి. గాంధి కేమాత్రముసంతోషము లేదు.

ఈ సత్యాగ్రహముచే బయటికికనఁబడని మేళ్లుకొన్ని చేకూరినవి. గుజరాతు రైతులలో బ్రహ్మాండమైన ప్రబోధము కలిగెను. రాజనీతియు నర్థమాయెను. ఈ ఖేడాపోరాటము స్వచ్ఛందసేవకులు రైతులలో నైక్యమగుట కవకాశ మేర్పఱచెను. వారి త్యాగశక్తి చాలవర్ధిల్లెను. వల్లభాయి పటేలువంటివాఁ డీయుద్యమముపట్ల ప్రజాహితజీవితములోని కాకర్షింపఁబడి, దేశసేవాధురంధరుఁడుగ పేరెన్నికఁ గనినాఁడన్న నింక వేఱుగ వర్ణింపవలెనా? గుజరాతు జాగరితమై, యొక మహోత్తేజమునందినది. ప్రజాజీవనములో చైతన్యము కలిగి, నవోత్సాహము వెల్లివిరిసినది. గాంధిజీ మార్గదర్శకత్వమున జరిగినపోరాటము ఫలితముగా రైతులు తమ యొక్కశక్తియెంతటిదో తాము తెలిసికొనిరి. తాముచేయఁబోవు త్యాగముమీఁదనే తమ యభ్యుదయ మాధారపడి యున్నట్లు గ్రహించిరి. ప్రజాశక్తి దానిపరిణామము నప్పుడప్పుడె బ్రిటిషుప్రభుత్వము రుచిచూచినది,

భారతదేశమునకు వచ్చిన కొద్దికాలములోనే గాంధి మూఁడు విజయములను సాధించినాఁడు. ఒకటి చంపరానులో, రెండవది అమదాబాదులో, మూఁడవది ఖేడామండలములో. ఈవిజయములచే గాంధిని భారతదేశమంతయు గుర్తించెను. పతితజాతినుద్ధరింపఁగలమహాత్ముఁడొకఁడులభ్యమయ్యెనుగదా యను నాశాకిరణము ప్రతివారి భావవీథులలోఁగనిపించెను.

౨

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామ మతిదారుణముగా జరుగుచుండెను. రాజప్రతినిధి భారతనాయకులను ఢిల్లీ కాహ్వానించెను. గాంధిజీ పిలువఁబడినాఁడు. ఖిలాఫత్ విషయమై, ఆలీసోదరులను వదలిపెట్టు విషయమై ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరములను నడిపెను. రాజప్రతినిధితోఁ గూడ నీసంగతిమాట్లాడుటకు నిశ్చయించుకొన్నాఁడు.

రాజప్రతినిధి సమావేశపఱచినసభకు వెళ్ళినాఁడు' యుద్ధమునకు మనుష్యులను ప్రోగుచేయువిషయమును గాంధితోసమర్థింప రాజప్రతినిధిసంకల్పము. గాంధి యందు కంగీకరించి, సమర్థించుచు హిందీలోమాట్లాడెను. రాజ ప్రతినిధి గావించెడు సభలలో మొట్టమొదట హిందీలో మాట్లాడిన ధీరుఁడు గాంధి. క్రొత్తచరిత్రనే సృష్టించినాఁడు. ఇందులకు దేశము నలుమూలలనుండి యభినందములవర్షము కురిసినది. ఆయనజీవితములో నదియొక మరపురానిఘట్టము. ఇది మొట్టమొదటి నిదర్శనమనుట కాయనసిగ్గుపడెను. మన భాషను సైతము విడనాడవలసిన గతియేమి?

ఒక సుదీర్ఘమైన లేఖనువ్రాసి సిమ్లాలోనున్న రాజ ప్రతినిధి కొక ప్రత్యేకవ్యక్తిద్వారా పంపెను. ఇంక యుద్ధమునకు మనుష్యులను ప్రోగుచేయుపని ప్రారంభించినది. ఖేడుచేరి వల్లభాయి మొదలగువారితో నాలోచించెను. గాంధి యభిప్రాయమునకు పెక్కురు సమ్మతింపలేదు. కొందఱు సమ్మతించినను భవిష్యత్కార్యక్రమమంతటి యాశాజనకముగ లేదు. ప్రజలకు ప్రభుత్వముపై నభిమానము శూన్యము. గ్రామములకు వెళ్ళినప్పుడు ప్రజలెంతమాత్రము సహకరించుటలేదు. బాడుగకైన బండ్లుకట్టరు. కాలినడకతోఁ బ్రయాణము. పోయినస్థలములలో నెల్లసభలుజరిపి యుద్ధములోఁ జేరమని ప్రజల కుద్బోధించుట. ఏ యొకరిద్దఱోతప్ప నింకెవరు ముందునకు రాకుండిరి. విమర్శించువా రెక్కువైరి. "ఇదియేనా నీ యహింసాసిద్ధాంత"మని వెక్కిరించిరి.

అచ్చువేసిన కరపత్రములు పంచిపెట్టినాఁడు. ప్రయత్నమెంతవిశాలముగ జరిగినదో, ఫలిత మంత సంక్షిప్తమైనది. యుద్ధమునకు జనులనుప్రోగుచేయుటలో నూరారు తిరుగుసరికి గాంధియారోగ్యమే చెడిపోయెను. దేహములో నిత్రాణ మెక్కువైనది. అప్పటికే యాయన యాహారము బెల్లము, వేరుశనగపప్పు, నిమ్మలు. అవిగూడ సరిగ జీర్ణమగుటలేదు. ఉపవాసములు ప్రారంభించెను. కొంచెమాఁకలియైన నిమ్మరసముఁ ద్రావువాఁడు. పూర్తిగ శరీరముచిక్కిపోయెను. అటులనె ప్రయాసతో అమదాబాదు రైలుస్టేషనులో వల్లభాయినికలిసికొని నడియాదిలో దిగెను. ఆ స్టేషనునుండి

అనాథాశ్రమమునకు నరమైలుదూరము. ఆ యింత నడచు సరికి గాంధికి బాధయెక్కువాయెను. కడకు మంచ మెక్కినాఁడు.

కొంచెము శరీరములో ప్రాణవచ్చి, నాలుగడుగులు వేయఁగలిగి, గాంధి పత్రికలుచదువుటకు ప్రారంభించెను. అశనిపాతమువలె 'రౌలతు కమిటీ రిపోర్టు' పత్రికలలోఁ బడెను. దానియందలి విషయములు చదివి యడలిపోయెను. కొందఱు మిత్రులువచ్చి ప్రతిఘటింపవలసి యున్నదని సలహానొసఁగిరి. అమదాబాదునకు వచ్చిచేరెను. వల్లభాయిపటేలుతో సంప్రతింప 'నేమి చేయవలె' నని ప్రశ్నించెను. అప్పుడు గాంధి "రిపోర్టులోని విషయములన్నియు శాసనములగు నెడల నష్ట కొన దీక్షఁబూనవలయును. ప్రేళ్ళపై లెక్కించునంతమంది దొరకినను సత్యాగ్రహము ప్రారంభింపకతప్పదు." అని గాంధి యనుయాయులతో నొక సభజరుపుటకు నిశ్చయించెను. ఆత్మగౌరవముకల భారతీయుఁ డెవఁడు నా 'కమిటీ రిపోర్టు' ప్రకారము జరుగఁబోవు శాసనముల సహింపఁడు. సభకు శ్రీమతి సరోజినీనాయుఁడు, వల్లభాయి మొదలుగా నిరువదిమంది యేతెంచిరి.

ఒక ప్రతిజ్ఞాపత్రముపై నందఱు సంతకములుచేసిరి. గాంధి పత్రికాప్రకటనలు గావించెను. దేశములో నప్పుడు గలసంస్థలు సత్యాగ్రహమును సాగింపఁగల సమర్థతతో లేవని గాంధి గుఱుతించి సత్యాగ్రహసభయొకటి స్థాపించెను. బొంబాయివారెక్కువుగ నందు సభ్యులుగఁజేరుటచే నాసభ

కేంద్ర మచటనె నెలకొల్పఁబడినది. నాఁటినాఁటికి సభ్యుల సంఖ్య పెరుగుచుండెను. పత్రికలు సమగ్రముగ నీ వార్తలు ప్రకటించుచుండుటచే దేశమందంతయు సభలు - సమావేశములు జరిగినవి. సత్యాగ్రహసభకు గాంధియే యధ్యక్షుఁడు. సభలోని విద్యాధికులతోఁ దఱుచు నభిప్రాయభేదము లెక్కువగ సంప్రాప్తించెడివి. గాంధి యనుసరించుపద్ధతులలోఁ గొందఱ కయిష్టము. తుదకాయనమాటను గాదనఁజాలక పోయిరి. ఈ వాతావరణమునుబట్టియె "యీసభ చాల కాలము నిలువఁజాల"దని గాంధి యూహింపఁగలిగినాఁడు.

చెన్నపట్టణములో నాయకులసభ జరిగెను. అందఱునుగలిసి సత్యాగ్రహవిధానమునె యవలంబించిరి. గాంధి కానాఁటిరాత్రి యొక కలవచ్చెను. మరుసటినాఁడె రాజగోపాలాచార్యులఁ బిలిచి "ముందు ప్రజలలో నెట్టియుత్సాహముగలదో పరిశీలింతము. అందుకొకనాఁడు హరతాళము, ప్రజలందఱు నుపవసింపవలసినదనియు విజ్ఞప్తి గావింతము. దానిపైన సత్యాగ్రహమునుగుఱించి యోచింపవచ్చు" ననెను. ఆచార్యులవా రందుకు సమ్మతించిరి. హరతాళమునకు 6-4-1919 తేది నిర్ణయింపఁబడినదనియు, నాఁడు ప్రజలుచేయవలసిన కార్యములు పత్రికలముఖమున దేశమునకు తెలుపఁబడెను.

ఏప్రిలు 4 వ. తేదివఱకు దక్షిణదేశసంచారముచేసి గాంధి బొంబాయి చేరుకొనెను. ఢిల్లీలో 30-3-50 తేదిన (మొదటప్రకటించినతేది — తరువాత మార్చిరి. మార్పు

వార్త వారికాలస్యముగఁ జేరినది) హరతాళము చాల విజయవంతముగ జరిగినది. హిందు-మహమ్మదీయు లన్నదమ్ములవలె కలిసి మెలసి చేసిరి. హరతాళము చేయువారల యూరేఁగింపుపై పోలీసులు తుపాకులు పేల్చిరి. కొందఱు మరణించుట, కొందఱకు గాయములు తగులుట తటస్థించెను. ప్రభుత్వము దండనీతికి దిగెను. లాహోరు, అమృతసరములలో నల్లైజరిగినది. బొంబాయిలో 6 వ. తేది హరతాళము చాలయుత్సాహముతో జరుపఁబడెను. మఱునాఁటి యుదయము 'చౌపాటి' కడ సమావేశము. జనసముద్రమె ప్రత్యక్షమైనది. "చట్టమును శాంతముగ నతిక్రమింపవలెను. అట్టివి రెండు మూఁడు మాత్రముగలవు. ఉప్పు నెవరిండ్లవారు వండుఁడు. ప్రభుత్వము నిషేధించిన గ్రంథములుకొనుఁడు." అని గాంధి యుపదేశించెను. అట్టిగ్రంథములలో నాయన వ్రాసినవె రెండుకలవు. హిందు-స్వరాజ్యము, సర్వోదయము. నాఁటి సాయంకాలముజరిగిన సభలో నవి విరివిగ స్వచ్ఛంద సేవకులు ప్రజల కమ్మిరి. ప్రభుత్వము దానిపై నేచర్యయుఁ దీసికొనలేదు. 7 వ. తేది ఢిల్లీ, యమృతసరములకై గాంధి బయలు దేఱెను. 8 వ. తేది మథుర చేరునప్పటికె ప్రభుత్వము వారు నిర్బంధింతు రనువార్త నలుగురిలో పొక్కెను. పలవల్ స్టేషనుకు చేరుసరికి యొక పోలీసుఅధికారి "మీరు పంజాబుకు వెళ్ళిన నల్లరులుజరుగునని మాకు భయమైనందున మిమ్ములం బోనిచ్చుటలే" దనియెను. గాంధి "అల్లరులు శాంతింపఁజేయుటకే పోవుచున్నా"ననెను. స్టేషనులోదింపి

గాంధిని పోలీసులు స్వాధీన మొనర్చుకొనిరి. అంచలమీఁద పోలీసు అధికారులు గాంధిని బొంబాయికి గొనివచ్చుచుండిరి. ఈవార్త బొంబాయిలో వ్రాకిపోయెను. గాంధిని బొంబాయిలో దింపి పోలీసులు వదలిపోయిరి. ఆయన పట్టణములోఁ బ్రవేశించుటతోడనె ప్రభుత్వము తన్ను నిర్బంధించినందుల కావేశపూరితులై జనులు గుంపులుగ నూరేఁగుచున్నారని వినెను. ఆ గుంపులో నొకటి కోటసమీపమునకుఁ జేరి ప్రవేశింప నుంకించుచుండెను. అశ్వికభటులు వారిని చెదరఁగొట్ట గుఱ్ఱముల గుంపులో నడిపించిరి. ఆదెబ్బకు జనులు పారిపోవఁ దొడఁగినారు. ఆవిషయమై పోలీసు ఉన్నతోద్యోగికి (కమీషనర్) ఫిర్యాదుచేయుటకు గాంధిజీ వెళ్లెను. ఈయనమాటలు లక్ష్యపెట్టడాయె.

'చౌపాటి'లో నొకసభజరిపి, శాంతితో సత్యాగ్రహముజరుపవలెననియు, నేపరిస్థితులలోను శాంతిని విడనాడఁగూడదనియు గాంధి యుద్బోధించెను. అమదాబాదులో నల్లరులెక్కువైనవి. ఒక పోలీసుఅధికారి చంపఁబడెను. నడియాదుదగ్గఱ రైలుపట్టాల నూడఁదీయ ప్రయత్నించిరి. వీరామగాములో ప్రభుతోద్యోగి వధింపఁబడినాఁడు. అమదాబాదులో 'మార్షల్' చట్టము నమలులోపెట్టినారు. వెంటనే గాంధి యచటికివెళ్ళి, పోలీసువారలనొప్పించి, యొకసభ నేర్పాటుచేసి ప్రజలను శాంతియుతముగ నుండుమని ప్రార్థించెను. నాఁటితో 'మార్షల్‌లా' రద్దుచేయఁబడినది. చాలమంది పెద్దలు సత్యాగ్రహము నాఁపుచేయుమని గాంధిగారిని

కోరుటకువచ్చిరి. ఆయనకూడ సమ్మతించెను. సాముదా యికసత్యాగ్రహము ప్రోత్సహింపఁదగినదికాదు. ప్రజ లున్మత్తులై హింసాకృత్యములకుఁ బూనుకొన్న సత్యాగ్రహ మునకుఁగల యర్థమేచెడునని గుఱుతించెను. తనతప్పును గాంధి యొప్పుకొనెను. హిమాలయమునంతటి తప్పని పలు మార్లు వాపోయెను. చట్టమును శాంతియుతముగ నతిక్ర మించు శక్తిసామర్థ్యము లోక స్వచ్ఛందసేవకుఁడైన సత్యా గ్రహికె కలదనుకొనెను. మరల బొంబాయిచేరి కొంతమ ది స్వయంసేవకులను సమకూర్చుకొని, వారలద్వారా శాస నోల్లంఘనము నెట్టిపద్ధతుల నిర్వహింపవలసియున్నదో ప్రజల కర్థమగునట్లుచేయ గాంధిజీ యుద్దేశ్యము. దినదినమునకు సత్యాగ్రహులసంఖ్య పెరుగుటకుమాఱుగ తఱుగుటకు మొదలైనది.

పంజాబులో పోలీసులు జరిపిన దురంతములకు మితి లేదు. 'మార్షల్ లా' ప్రకటించి, ప్రత్యేక న్యాయస్థానముల నేర్పఱచి నిరంకుశముగఁ బ్రజల శిక్షింపసాగిరి. గాంధి యచటికి కేగవలె ననుకొని, యనుజ్ఞకై రాజప్రతినిధికి వ్రాసికొనెను. వ్యతిరేకముగ ప్రత్యుత్తరము వచ్చెను. చట్టమును ధిక్కరించి పోవుటలో లాభము లేదని గాంధి తలంచినాఁడు. తన సత్యాగ్రహపద్ధతులను ప్రచారముచేయు నిమిత్తము, ప్రజలలో ప్రబలిన హింసావిధానములను రూపు మాపునిమిత్తము కొందఱు మిత్రులచే నంతకుముందు నడుపుచున్న 'యంగ్ ఇండియా' (యువభారతము) అను

ఆంగ్లవారపత్రికను, 'నవజీవన్' అను గుజరాతివారపత్రికను నడుపుటకు నడుము కట్టుకొనెను.

పంజాబులో డైయరు దుష్పరిపాలన కంతులేదు. ఖిలాఫతు ఉద్యమము విషయమై ఢిల్లీలో జరుగఁబోవుసభకు పిలుపువచ్చుటతోడనె యచటికి వెళ్లెను. ఆ ఖిలాఫతు ఉద్యమముతో గోవధనివారణ మొదలగు సమస్య లంటఁబెట్టఁ జూచుచుండిరి. గాంధి వాని కన్నింటికి సమ్మతించక ప్రత్యేకముగ ఖిలాఫతువిషయమై తీర్మానింపవలెనని పట్టు బట్టెను. ప్రభుత్వమువారందుల కంగీకరింపనిచో నేమిచేయవలెనని ప్రశ్న. గాంధి మాట్లాడుచు 'సహాయనిరాకరణ' మను పదమును మొట్టమొదట యుపయోగించెను. విదేశ వస్తువులను బహిష్కరించుట మంచిదని కొందఱి సూచన. కడకు విదేశవస్త్రములు బహిష్కరింపఁబడవలెనని తీర్మానింపఁబడెను. చాలముఖ్యమైన యీ ఖిలాఫతువిషయములో ప్రభుత్వము న్యాయము కలిగింపకున్న ముసలమానులు ప్రభుత్వమునకు సహాయముచేయుటను మానుకొందురు. ఇంతలో నమృతసరమున కాంగ్రెసు సమావేశము జరిగెను. ఆ సమావేశమునకు గాంధి వెళ్లుటయేకాక, ఆలీసోదరులు చెఱసాలనుండి విడువఁబడి యచ్చటికి వచ్చిరి. చక్రవర్తిగారేవో కొన్ని సంస్కరణలవిషయమై ప్రకటనచేసిరి. అందు విషయమై గాంధికి, చిత్తరంజనదాసు, మోతీలాలునెహ్రూలకు మధ్య యభిప్రాయభేద మేర్పడెను. మదనమోహన మాలవ్యాచేత నాపరిస్థితి తొలఁగింపఁబడినది. ఆ సమా

దేశముతో గాంధికి ప్రత్యక్షము, సన్నిహితమునైన సంబంధము కాంగ్రెసుతో నేర్పడెను. అందులో రెండువిషయములు చాల ముఖ్యమైనవి. జలియన్‌వాలాబాగు స్మారకచిహ్నము నెలకొల్పుట. ఇంకొకటి కాంగ్రెసు కొకవిధమైన నియమనిబంధనావళి నేర్పఱచుట. ఈ రెంటికిఁజెందిన యుపసంఘములలో గాంధిసభ్యుఁడు, ఆయనయే వీని సంపూర్ణ కార్యభారము వహించినాఁడు. స్మారకచిహ్నమున కయిదు లక్షలరూప్యములు చందా లెత్తవలెను. అది సామాన్య కార్యమా ?

1908 వ. సంవత్సరమువఱకు గాంధి రాట్నమును గాని మగ్గమునుగాని యెఱుఁగఁడు. సత్యాగ్రహాశ్రమము నేర్పాటుచేసినతరువాత, యచట మగ్గములఁబెట్టించెను. ఆ మగ్గములమీఁద నేయఁబడినట్టి వస్త్రములనే ధరింపసాగినాఁడు. గంగాబాయి యనునామె సహాయముతో విశ్వప్రయత్నముచేసి, బరోడా దేశమందుఁగల బీజాపురమునుండి రాట్నమును సంపాదింపఁగలిగెను. అనేకప్రయాసల కోర్చి దూదినేకుట, రాట్నమువడుకుట మొదలగువిషయముల నాశ్రమవాసులకు నేర్పినాఁడు. నాఁటినాఁటికి "స్వదేశీ" ప్రచార మనుపేరుతో నీఖాదీ వ్యాప్తికాఁజొచ్చెను. ఈ ఖాదీమూలమున దరిద్రముతో బాధపడునట్టి భారతీయులకుఁ గొంతకుఁ గొంత మేలుగలదని గాంధి యాశయము. దీక్షతో ఖద్దరు ధరింపసాగినాఁడు. మిల్లుయజమానుల కీ "స్వదేశీ" ప్రచార మేవగింపుగానుండెను. వారిని మార్చుటకుఁ బ్రయ

త్నించి గాంధి విఫలుఁడైనాఁడు. ప్రజలలో మాత్రము చాల వఱకు ప్రచారమయ్యెను.

ఖిలాఫతు మహాసభ జరిగెను. శాంతియుతముగ ప్రభుత్వముతో సహాయనిరాకరణ మొనర్పవలెనని యందఱు నామోదించిరి. తరువాత గుజరాతులో రాజకీయమహాసభ జరిగెను. గాంధిగారె సహాయనిరాకరణ తీర్మానముఁ బ్రవేశపెట్టిరి. వాదోపవాదములైన తరువాత నధికసంఖ్యాకుల సమ్మతితో నామోదింపఁబడెను. 1920 వ. సంవత్సరమున కలకత్తాలో కాంగ్రెసు ప్రత్యేకసభ జరిగెను. లాలా లజపతిరాయిగా రధ్యక్షతవహించిరి. అసహకారపు తీర్మానములో స్వరాజ్యము విషయముగూడ చేర్పఁబడెను.

ఈవిధముగ సహాయనిరాకరణము విషయమై తీవ్రముగ నాలోచించునప్పుడు గాంధిగారికి వజ్రనిపాతమువలె లోకమాన్య బాలగంగాధరతిలక్ ఇహలోకమును వీడినాఁడన్నవార్త వచ్చెను. దేశమున కింతటికష్టకాలమున లోకమాన్యుఁడు గతించినందులకు గాంధి మిగులవగచెను.

కలకత్తా కాంగ్రెసులోజరిగిన తీర్మానములు నాగపూరు కాంగ్రెసులో నామోదింపవలసి యుండెను. అహింసాత్మకమగు సహాయనిరాకరణమున కందు తీర్మానించిరి. ఆసభయందే హిందు - ముసలమానుల యైక్యతను గుఱించియు, హరిజనులు, ఖాదీ మొదలగు విషయములను గుఱించియు తీర్మానములు చేయఁబడినవి. ఆ శుభదినము నుండి, గాంధిగారి ప్రత్యేకశ్రద్ధవలన కాంగ్రెసుచేసిన తీర్మా

సముల కనువుగా కాంగ్రెసువాదు లస్పృశ్యతను బాటింపక సంఘములో నడుగునఁబడియున్న హరిజనుల నుద్ధరింపఁ బూనుకొనిరి—ఖద్దరు ధారణానియమముచేత నిరుపేదలతో సంబంధముఁ బెట్టుకొనిరి.—ఖిలాఫతు ఉద్యమముకొఱకు సహాయనిరాకరణముఁ జేయ సంకల్పించి హిందు - ముసల మానులలో నైక్యతాబీజములు వెదజల్లిరి.

అంతకుముందు పత్రికలలోను, సభావేదికల దగ్గఱ నున్న రాజకీయములు పెద్దవారిని, పిల్లలను, స్త్రీలను చరఖారూపమున నాకర్షింపఁగలిగి, సామాన్యమానవుని యింటిగుమ్మము ముందునకుఁగూడ చొరఁబడినవి. చరఖా, ఖద్దరు, గాంధిటోపి ప్రజలను విదేశవస్త్రములను బహిష్కరింపవలెనని ప్రోత్సహించుటయేగాక, సామాన్యప్రజానీకాని కొకవిధమైన భావావేశము కలిగించి, యెంతోకాలముగ నందఱిలో నణఁగియున్న దేశభక్తి నొక్కమాఱు పైకుబుకు నట్లుచేసి, దేశమందంతయు స్వరాజ్యవాద ఝుంఝామారుతము వ్యాపించునట్లుగ చేయఁగలిగినవి.

1920 వ. సంవత్సరములో కాంగ్రెసులో నామోదింపఁబడిన సహాయనిరాకరణోద్యమానికి దేశమంతయు నిదివఱ కెన్నడు నామోదింపనియట్లుగ నా కార్యక్రమము నామోదించెను. ప్రజలే యీ యుద్యమమును నడిపినారు. కాంగ్రెసు వారి ననుసరింపవలసివచ్చినది. త్యాగముచేయ వలెనని పిలుపురాఁగానే ప్రజలలో నొక బ్రహ్మాండమైన చైతన్యమువచ్చినది. కాకదీఱిన బ్రిటిషుజమనసీతి యధికార

గర్వముతోఁ దలయెత్తినది. మహాధైర్యసాహసములతోఁ బురుషులు, స్త్రీలు, బాలురు కలసికట్టుగ పాఠశాలలను, కళాశాలలను వదలివేసిరి—న్యాయస్థానాలను, విదేశవస్త్రములను విడనాడిరి—ప్రభుత్వసభలను, సమావేశములను బహిష్కరించిరి. ప్రభుత్వముచే నీయఁబడిన బిరుదులను త్యజించిరి. ఈవిధముల దిగ్విజయముగ సాగిన సహాయనిరాకరణోద్యమము 'పన్నులీయకుండు' నుద్యమమునకు దారి తీసెను.

1921 వ. సంవత్సరములో భారతదేశమంతయు రక్తరహితవిప్లవములో మునిఁగి తేలెను. ఆ సమయమున నె వేల్సురాజు (బ్రిటిషు పంచమ జార్జిచక్రవర్తి జ్యేష్ఠపుత్రుఁడు) దేశసంచారము గావించెను. దేశమంతయు నయోమయము గను, శత్రుచర్యలతోడ, నంధకారబంధురమై, 'తుఫాను' చెలరేఁగఁబోవుచున్నట్లుండెను. ప్రజలు సామూహిక ప్రభుత్వవ్యతిరేకతకు సిద్ధమై, యూఁపిరిపీల్చుకొనుటకైనను విశ్రాంతికోరక, పన్నులనిరాకరణము పిలుపుకై కాచుకొని యుండిరి. పై పరిస్థితుల నన్నియు నవగాహనముచేసికొన్న గాంధి స్వరాజ్య మొకసంవత్సరములో నిప్పింతునని ప్రజలకు వాగ్దాన మొసఁగినాఁడు—అయిన తాను పెట్టఁబోవు నిబంధనలకుఁ గట్టుబడి యుండఁగోరెను. అట్టిసందర్భములో మలబారునందు మాప్లాలు ప్రభుత్వముపై నాయుధములతోఁ దిరుగుబా టొనర్చిరి. "చౌరిచౌరా"యందు పోలీసువారిని విషాదాత్మకముగఁ జంపిరి. ఈ రెండుసంఘటన లాయన

కనులముందు ప్రత్యక్షమైనవి. వీనితో సామాన్యప్రజలలో నుద్రేక మెక్కువయనియు, నీయుద్రేకము నాధారముగఁ గాని జాతీయోద్యమమును నడుపఁ బ్రయత్నించుచో నధికారులు దమననీతితో నడఁచివేయుదురనియు భావించినాఁడు.

గాంధికి యహింస, ప్రేమ జీవితాదర్శములు. ఆ యాదర్శముల సామాన్యప్రజానీకానికి తాత్కాలి కాను కూలములుగ నుండునేగాని, కష్టములలోను-నుద్రేకములలో నుండవు. ఈ ముఖ్యభేదమును గమనించి వారికి గుణపాఠము నేర్పఁదలఁచినాఁడు. అది యసామాన్యమైనపని. అందుచేత వెంటనే యుద్యమమును నిలిపివేసెను. అందులకై తన సహచరులచేత నెంతగనో నిందింపఁబడెను. అసంతృప్తులైన ప్రజలచేతకూడ విమర్శింపఁబడినాఁడు. వేల్సురాజు బొంబాయికి వచ్చినప్పు డక్కడజరిగిన రక్తపాతసంఘర్షణలకు తన విముఖత ప్రదర్శించి, ప్రజలు పశ్చాత్తాపపడునట్లు చేయుటకై 1921 వ. సంవత్సరములో నవంబరు మాసమందు నయిదుదినము లుపవాసముచేసెను. ఆ యుపవాసముచేత ప్రజలలో నొకవిధమైన భావచైతన్యము కలిగినది. ప్రజలు చేయు తప్పులను నిర్భయముగ, నిక్కచ్చితముగఁ జెప్పఁగల శక్తి యాతనికొక ప్రత్యేకత. తనపత్రికలలో వ్యాసములను బ్రకటించి, ప్రజలఁ గార్యాచరణశీలురగను జేయుట యె నిత్యకృత్యము. ప్రభుత్వపు పునాదులే తెగిరిపోనున్నవను భంగ [illegible]వారి కేర్పడెను. 1921 వ. సంవత్సరములో నుద్యమ యుద్రేకముపోయి దేశ మొకవిధముగ శాంతించినది.

దాని నాధారముగ గాంధిని 10-3-1922 వ. తేదిన సబర్మతి ఆశ్రమములోనుండఁగా ప్రభుత్వము నిర్బంధములోనికిఁ దీసి కొనెను. భారతదేశములో మొట్టమొదటిసారి రాజద్రోహ కరమగు మూఁడువ్యాసములు "యువభారతము" పత్రికలో వ్రాసెనని న్యాయస్థానమున నేరము మోపఁబడెను. ప్రభుత్వ మిందులకెంతో సాహసముచేసినది. ప్రజలందఱు గాంధి యీదేశమున కెదురుచూచుచున్నారు. ఆ చారిత్రాత్మక మైన న్యాయవిచారణలో (1922 మార్చి) గాంధిజీ యొసఁ గిన వాఙ్మూలము వృథాయయినది. న్యాయస్థాన మెంత వఱకు శిక్షింపఁగలదో యంతవఱకు శిక్షించుటకు పూను కొన్నది. ఆఱుసంవత్సరములు కఠినశిక్ష. ఆయన సహచరు లందఱు భయభ్రాంతులైనారు. ఆశిక్ష భౌతికముగ గాంధికి కొంతశ్రమకుఁ గారణమె యైనను, మానసికశక్తి మహా ప్రభావయుతముగఁ బనిచేసినది. ప్రజలలో నంతకముందు కన్న నెక్కువ యాదరాభిమానములు చూఱగొన్నాఁడు.

కాంగ్రెసుసంస్థ "స్వరాజ్యముఠా" వారిచేతులలోకి వచ్చినది ఆ 'ముఠా'కు నాయకులు మోతీలాలు, దేశబంధు దాసు. వారు శాసనసభలలోఁ బ్రవేశింప తీర్మానించిరి. సహాయనిరాకరణముమాట నాఁటితో చచ్చిపోయెను. కాంగ్రెసుసంస్థలో చచ్చినదేకాని, ప్రజలమనస్సులలో మాత్రము చావలేదు—చచ్చుట యసాధ్యము.

చెఱసాలలో గాంధిజీ కొకవిధమైన భావపరివర్తనము కలిగినది. విపరీతమైన సైనికబలముతోఁ గూడిన బ్రిటిషు

సామ్రాజ్యమును భారతదేశమునుండి తొలగించుట యెట్లని తీవ్రముగ నాలోచించినాఁడు. అమృతసర్ జలియన్‌వాలా బాగ్ దురంతములు కన్నులకుఁ గట్టినవి. సమావేశమునుండి వెలుపలికివచ్చుట కొకేమార్గము, ఆమార్గముగుండ బయటికివచ్చు స్త్రీలను, పురుషులను, బాలబాలికలను బ్రిటిషు ప్రభుత్వము నిర్దాక్షిణ్యముగ తుపాకిగుండ్ల కాహుతిగావించెను. ప్రజలేమాత్రము దౌర్జన్యమునకుఁ బూనుకొన్న దమనసీతితో ప్రభుత్వ మడఁచును. అహింసావిధానముతప్ప వేఱొండు నుపాయము లేదు. అహింసతోఁగూడిన సహాయ నిరాకరణముచే బ్రిటిషువారు దేశమును వదలిపెట్టి పోరా? ఇచట ప్రజలసహకారములేకున్న వారుండుట సాధ్యమా? అనుప్రశ్నలు వేసికొని కార్యక్రమము నారంభించినాఁడు. చెఱసాలలోఁ గాలమును వృథపుచ్చలేదు. అచటనే యాత్మకథ వ్రాయుటకు మొదలుపెట్టెను. ఆరోగ్యమార్గము భగవద్గీత వ్యాఖ్యలు వ్రాసినాఁడు. మూలవ్యాధిచే గాంధిజీ చెఱసాలయందు చాల నీరసించి, జబ్బుపడియుండెనన్న వార్త దేశము నొక్కమాఱు కల్లోలపఱచెను. అప్పుడనే శస్త్రచికిత్స కావింపఁబడి, నిర్నిబంధనగా ప్రభుత్వముచే వదలివేయఁబడెను.

ఆ సంధికాలములో 'స్వరాజ్యవర్గము' వారిచేతుల యందు కాంగ్రెసు చాల క్లిష్టపరిస్థితిలోనికి వచ్చెను. ఒకవైపు గాంధిజీ సిద్ధాంతములు కూడ నడచుచున్నను, వేఱొకవైపు గాంధీ నాయకత్వమునకు కాక్షింపఁబడెను. ఆంతరంగిక

వ్యవహారములకు సంబంధించినంతవఱకు కాంగ్రెసుసంస్థ కీగతికల్గినప్పుడె దేశమందు మతకలహములు చెలరేఁగినవి. కోహట్‌లో జరిగిన హిందు-మహమ్మదీయుల కలహమునకు నిరసనగా ఢిల్లీలో 18-9-24 వ. తేదినుండి ఏడునెనిమిది దినములు గాంధిజీ యుపవాసదీక్ష గావించెను. ప్రజ లాతురతతో నాయన ఆజ్ఞనలను శిరసావహింప నొప్పుకొన నది విరమింపఁబడెను.

సైమన్ దొర ప్రధానముగఁగల యొకసంఘము (కమిషన్) మన దేశమునకు వచ్చెను. ఆ సంఘముయొక్క రాక యంతవఱకు నిద్రాణమైయున్న భారత రాజకీయసంస్థల కన్నింటికి ప్రతిఘటనకు మూలాధారమై జాగృతికిఁ గారణమైనది. ప్రజలలో ప్రభుత్వముపై పెచ్చుపెరిగిన యేహ్యభావమును గాంధి గమనించినాఁడు. వెంటనే దేశమును బోరాటమునకు సిద్ధమొనర్చెను. హిమాలయపర్వతములు మొదలుకొని కన్యాకుమారివఱకుఁగల ప్రజ లేకకంఠముతో 'సైమన్ కమిషను' బహిష్కరించిరి. దానితోపాటె ప్రభుత్వపు దమనస్థితి పరాకాష్ఠచెంది, లెక్కలేనన్ని లాఠీ దెబ్బలు ప్రజలుతినవలసి వచ్చెను. లాలా లజపతిరాయి వంటివాఁడా దుర్మార్గమునకుఁ గ్రుంగిపోవలసెను గదా! తన్నులుతినలేక విసిగిన ప్రజాబాహుళ్యానికి సహాయనిరాకరణము, ప్రజలందఱి తిరుగుబాటు తప్ప వేఱొకటి గత్యంతరములేదు. తుదకు గాంధి ప్రజావాణి నంగీకరింపకఁ దప్పునా?

ఒకవైపు ప్రజలసాముహికపు తిరుగుబాటును గోరు చున్నను నిర్మాణకార్యక్రమమువైపు దృష్టినిల్పి, అందులో ముఖ్యముగ ఖద్దరు, మద్యపాన నిషేధము, హరిజనసంస్కారణలను గుఱించి విశేషప్రచారము చేయసాగెను. 1929 వ. సంవత్సరమున కాంగ్రెసు సంపూర్ణస్వరాజ్యము తీర్మానము నామోదించినది. 1930 వ. సంవత్సరము జనవరి 26 వ. తేది దేశములో నలుమూలల స్వాతంత్ర్యదినము మహావైభవముగ జరుపఁబడెను. ప్రజలందఱు స్వాతంత్ర్యప్రతిజ్ఞ గైకొనిరి. ఉద్రేకోత్సాహములు భారతీయులలోఁ బొంగులు వారినవి. దీనితోఁబాటు ప్రభుత్వమువారి నిరంకుశచర్యలు నధికమాయెను. పదునొకండు సూత్రములుగల యొకప్రణాళికను సిద్ధపఱచి, గాంధి ప్రభుత్వమునకుఁ గడసారి హెచ్చరించెను. జాతీయాభ్యుదయమునకై యాయన సూచించిన యేకాదశసూత్రము లివి: సమగ్రమద్యపాన నిషేధము, ఉప్పుపన్నుతొలఁగించుట, రూపాయిలోని విభాగమును తగ్గించుట, సైనికవ్యయము నదుపులోనికిఁదెచ్చుట, భూమిశిస్తు తగ్గించుట, విదేశవస్త్రముపై వ్యాపారనిబంధనలు, రాజకీయవాదులను చెఱసాలలనుండి వదలిపెట్టుట, గూఢసమాచారశాఖ నెత్తివేయుట! నైతికముగ గాంధిజీకోరిన యాసూత్రములు, వాని నిర్మాణాత్మకశీలము ప్రశ్నింపరానివి. వానిని పత్రికలద్వార, ఉపన్యాసవేదికలద్వార దేశీయులకు, ప్రభుత్వమునకు నర్థమగునట్లు వ్యాఖ్యానించెను.

గాంధిజీ ప్రభుత్వమున కిచ్చిన హెచ్చరిక నిష్ప్రయో జనకరమైనది. దానిచే నుప్పుసత్యాగ్రహ మొనర్తునని వాగ్దాన మొసఁగినాఁడు. దేశమునకు స్వరాజ్యము సంపాదింప నిది సబర్మతి ఆశ్రమములో నడుగుపెట్టనని ప్రతిజ్ఞగైకొనెను. అందుకై దండికివెళ్లెను. ఎన్నికష్టాలువచ్చిన యెదుర్కొని, సహనముతో స్వరాజ్యమును సంపాదింపవలసి యున్నదని ప్రజల కుద్బోధించినాఁడు. వెంట నెనుబదిమంది సత్యా గ్రహమునకు సిద్ధమైరి. వేనకువేలు జనులు గుంపులై వచ్చి, సత్యాగ్రహవీరుల కుత్సాహముఁగొల్పిరి. కార్యక్రమముఁ దాని యుద్దేశ్య మాసన్నప్రజానీకానికి గాంధిజీ వివరించి నాఁడు. ఉదయమె సముద్రములో స్నానము చేసి, యొక కుండతో నీరు తెచ్చి ఉప్పుతయారుచేసెను. ఆనాఁడె దేశ మున పలుప్రదేశముల నట్టి కార్యక్రమ మెజరిగెను. ప్రభుత్వ మణచివేయుటకు గాంధిని, యితరనాయకులను నిర్బంధించి నది. కాంగ్రెసుసంస్థయే నిషేధింపఁబడెను. మఱుసటి సం వత్సరమువఱకు దేశములో చట్టవ్యతిరేకవిధానములు జరుగు చునెయుండెను. 26-1-31 నాఁడు భారతరాజప్రతినిధి లార్డ్ ఇర్విన్‌తో సంప్రతింపులకైగాంధివిడుదలచేయఁబడినాఁడు. చట్ట వ్యతిరేక కార్యములు మానవలసినదిగా ప్రజలను ప్రార్థించెను. 'రౌండు టేబిల్' సభ కాహ్వానించిరి. చాలకాలముజరిగినదీర్ఘ సంభాషణములఫలితముగ గాంధి-ఇర్విన్ ఒడంబడిక జరిగినది.

దండిసత్యాగ్రహము జాతీయోద్యమములో నొక నూతనోత్తేజము కలిగించెను. ఉప్పుశాసనము నెగాక, అటవిక

శాసనములను సైతము దేశమందంతట నతిక్రమింపఁబడెను. ఈపర్యాయము స్త్రీలు, బాలబాలికలు సైతము 'అరెస్టు' కాఁబడిరి. శాసనమును వ్యతిరేకించుట, శిక్షపొందుట యొక్క గొప్పగౌరవప్రదమైన యోగ్యతగ దేశమం దందఱును భావించిరి. దేశభక్తి కది చిహ్నమయ్యెను.

'రౌండు టేబిల్' సమావేశమునకై గాంధి లండను వెళ్లెను. అది ఫలవంతముకాలేదు. కాని, గాంధిజీని లండను లోని యాబాలగోపాలము గౌరవించినది. పంచకట్టుతో లండనులో దిరిగిన ధీరుఁడు గాంధి. ఆవేషమె యచటివారి నెక్కువగ నాకర్షించెను. ఆంగ్ల బాలురుసైతము గాంధిని సత్కరించిరి. ఆంగ్లనాయకులకు భారతస్వాతంత్ర్యావశ్య కతను గూర్చి నచ్చఁజెప్పెను. ఆయనయొక సన్యాసియని కొందఱు వెక్కిరించినను వారి యభిమాన పాత్రుఁడైనాఁడు భారతదేశముయొక్క పరిస్థితు లందఱు నవగాహనచేసికొనిరి. నిరాడంబరమైన తన సహజవేషముతోడనె నాఁడు రవి యస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యాధిపతి పంచమజార్జిని సుప్రసిద్ధమైన "బకింగ్‌హామ్" మహాసౌధములో గాంధి కలిసికొని ముచ్చటించెను. నిరాశతో మరల మాతృదేశ మునకు వచ్చినాఁడు.

పరిస్థితులలోఁ గలిగిన విషమ పరిణామములను నాయ కులు గమనించిరి. అప్పుడు ప్రభుత్వము పెద్దయెత్తున కాంగ్రెసు సంస్థను, దాని కార్యక్రమముల నడఁచివేయుటకు తీవ్రమైన దండన విధానముల ననుసరించెను. నిరంకుశ

శాసనముల యొక్క, పోలీసుల దౌర్జన్యము యొక్క రుచిని ప్రజలు చవిచూచిరి. మరల సాముహిక ప్రభుత్వ వ్యతిరేకోద్యమము 31-12-31 నుండి ప్రారంభమాయెను. 4-1-32 నాఁడు గాంధిజీ సర్దారు పటేలుతో సహా నిర్బంధింపఁబడినాఁడు. ప్రజలు యుద్రిక్తులైనను, మిక్కిలి శాంతముతో నాయన యడుగు జాడలలో నడచిరి. ఇంచు మించు నొక లక్షకు మించి యాబాలస్త్రీ వృద్ధులు చెఱసాలల కేగిరి. చెఱసాలలు భారతదాస్య విమోచకులైన రాజకీయ వాదులతో నిండిపోయినవి. విప్లవజ్వాలలు దేశములో నలుమూలల ప్రాకినవి.

"మాక్డోనాల్డు" నిర్ణయము ననుసరించి హిందువుల నుండి హరిజనులను వేఱుచేయుటకు ప్రభుత్వ మొక పథకమును వేసెను. దాని ప్రకారముగ నెన్నికలలో హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గము లేర్పఱచఁ బడుట. ఇందుకు గాంధి సమ్మతింపక ఎఱ్ఱవాడ జైలులో నామరణాంతోపవాస దీక్షకుఁ గడంగుదు నని ప్రభుత్వమునకుఁ దెలిపెను. అప్పుడు ప్రభుత్వము చెంతనుండి సరియగు సమాధానము వచ్చుటచే నాయుద్యమము నుండి విరమించుకొన్నాఁడు. 1933 సం. మే 8-వ తేదిన పరిశుద్ధతకై యుపవాసము గాంధిజీ పూనెను. "నాయాత్మ పరిశుద్ధితకి, నాసహచరులు చాల జాగ్రత్త వహించి హరిజన సమస్య విషయములో ప్రత్యేకశ్రద్ధ వహించుట" కని వివరించినాఁడు. వారము లోపలనె ప్రభుత్వముచే చెఱసాలనుండి విడుదల చేయఁ

బడెను. "పర్ణకుటీ" (పూనా చెంత) లో నుపవాస దీక్షను విరమించెను. ఆ మధ్యకాలములో సామూహిక ప్రభుత్వ వ్యతిరేకోద్యమమును నిలుపుదల చేసెను. కాని, వ్యక్తిగత సత్యాగ్రహము సాగింప ననుమతించినాఁడు. మరల గాంధి నిర్బంధము. కొన్ని రోజులైన పిమ్మట ప్రత్యేకమైన ఆంక్షలను బెట్టి గాంధిజీని చెఱసాలనుండి వదలిపెట్టిరి. ఆ ఆంక్షల నాతఁడె యుల్లంఘించెను. ఒక సంవత్సరము శిక్ష విధింపఁబడి, ఎఱ్ఱవాడ చెఱసాలలో నుంచఁబడెను. పూర్వ మిచ్చిన సౌకర్యము లీయలేదు, దానితో నీయన యుపవాస దీక్ష మొదలు పెట్టెను. వారము రోజుల లోపల చాల బలహీనమేర్పడి, ప్రమాదాస్పద మయ్యెను. వైద్యశాలకుఁ బంపిరి. తుదకు విడుదల చేయక తప్పలేదు.

'మాక్డొనాల్డు' సూచనలప్రకారమె కులనివృత్తితో నిమ్నజాతులకు శాసనసభలో ప్రత్యేక నియోజకవర్గములు గలవని ప్రభుత్వ మొకప్రకటనచేసెను. ఇది హైందవసంఘములో చీలికల నెక్కువచేయుట కనుసరింపఁబడిన విధానమె కాక, దేశములో విభిన్నత వృద్ధిపఱచుట కనుకూలముగ నుండెను. గాంధిజీ యీ మరణాంతోపవాసదీక్షకు ప్రారంభించినాఁడు. సవర్ణహిందువులు – నిమ్న జాతులు కలిసి పూనాలో నొకయొప్పందమునకు వచ్చిరి. దానినె 'పూనా యొడంబడిక' యందురు. ఆ యొడంబడిక ప్రకారము ప్రత్యేకనియోజకవర్గములు తొలఁగింపఁబడినవి. గాంధిజీ యుపవాసదీక్షను విరమించుకొనెను. ఇదిజరిగిన కొంతకాల

మునకే గాంధి ప్రత్యేకముగ నస్పృశ్యతను గూడదనుచు, హరిజనులయభివృద్ధి కన్నివిధముల పాటుపడఁ దొడఁగెను.

గాంధిజీదృష్టి యెక్కువ నిర్మాణాత్మక కార్యకలాపాలపైఁ బడినది. దేశములో హిందు-ముస్లిములు విభేదాలు రెచ్చగొట్టఁబడినవి. బ్రిటిషు వారు "విభజించి పాలింత"మను నీతియే యిందులకుఁ గారణము. మతసమస్య వచ్చిపడుటచేత దేశమున కనేకకష్టములు సంభవించునని తలఁచెను. అన్నింటికంటె పెద్దకష్ట మేమన బ్రిటిషువారి యధికారముద్ర మనపై శాశ్వతమగునని. సంఘములో నొకవైపు హరిజనులు సైతము నీచముగఁ జూడఁబడు చుండిరి. కులములమధ్య, మతములమధ్య సమైక్యతఁ జేకూర్పఁ బ్రయత్నించినాఁడు. పేదలకష్టస్థితికి వగచెను. సంపూర్ణ మద్యపాననిషేధమునె ప్రవేశపెట్టనట్లయిన పేదల కడగండ్లు తప్పవు. అందుల కవకాశమెక్కడ? దానిమూలమున నధికాదాయము వచ్చుచుండుటచే ప్రభుత్వము మద్యపానమును ప్రోత్సహించుచున్నది. మానవుని నిత్యజీవితావసరాలకుఁ గావలసిన వస్తువులకు సైతము యంత్రములు విరివిగ నుపయోగపరచుకొనుచుంటను గర్హించినాఁడు. యంత్రముల దిగుమతులక్రింద భారతదేశ ధనప్రవాహమితర దేశములకు తరలిపోవుననియు, నీవ్యవస్థను దప్పించుట కవిరళకృషి చేయవలెననియు నిశ్చయించుకొనెను. అట్టి పరిస్థితులలోనె "హరిజన" పత్రిక బయటపడినది. దానిలో వ్యాసములువ్రాసి ప్రజలకు వాస్తవిక రాజకీయజ్ఞానమును

గలిగించువాఁడు. కుటీరపరిశ్రమలను పునరుద్ధరించి, స్వయం సమృద్ధసూత్రము ప్రకారము జీవితావసరముల వాడుకలో మార్పు నాకాంక్షించెను ఈ యుపదేశములను తొలు దొల్త నందఱు నామోదింపకపోయినను రాను రాను వానిలోఁగల నగ్నసత్య మెల్లరు నెఱిఁగిరి. భారతదేశాభి వృద్ధియె దీని ప్రధానలక్ష్యములుగా గుఱుతింపఁబడినవి.

ఆయన యాజ్ఞలను చాలమంది పెద్దలు పాలించువారు. జాతీయభావములుగలిగి, దేశదాస్యవిమోచనకై యఖండ త్యాగములకు సిద్ధముగనున్న భారతయువకబృందమున కాయనయె యాశాజ్యోతి. జవహర్‌వాల్ నెహ్రూ గాంధితోఁ గలిసికొనెను. నాఁటినుండి వారిద్వురిమధ్య నేర్పడిన గాఢపరిచయబంధము, ప్రేమబంధముగ మాఱి గురుశిష్యసామ్యమును బొందెను. గాంధిమాటను జవ దాఁటువాఁడుకాఁడు. ముప్పదిమూఁడుకోట్ల భారతప్రజా నీకాని కాయన నాయకమణికాఁగలిగెను. ఆ మహాత్వ మెట్లాయనకబ్బెను? నిస్వార్థమైన త్యాగదీక్ష, అహింసా తపస్సులే యందులకుఁగారణము. చరిత్రలో నొకవ్యక్తి యింతటి జనబాహుళ్యమును తన యడుగుజాడలలోఁ బెట్టు కొని నడిపించుట కుదాహరణములు లేవు. ప్రేమతో ప్రజలను జయించినాఁడు. సిద్ధాంతములతో, కార్యాచరణముతో, మహోత్తమాదర్శములతో నాయకత్వమును సాధించినాఁడు. అది యందఱకు సాధ్యమా? ఒక్క మహాత్ములకే! అందులకే గాంధిని ప్రజావాణి "మహాత్మా" యని యుద్ఘాటించినది.

వర్ధాలోఁ గొంతకాల ముండుటకు తీర్మానించుకొనెను. అక్కడ జమ్నాలాల్ బజాజ్ చేత సత్కృతుఁడై యొకచో నివాస మేర్పఱుచుకొనియెను. భారతదేశమం దేడు లక్షల గ్రామములలో నివసించునట్టి గ్రామీణులపై మహాత్మునకు గాఢాభిమానము. అందులకై పట్టణ నివాసమునే యేవ గించుకొన మొదలిడినాఁడు. 1936 వ. సంవత్సరములో నొకనాఁ డెవరికిఁ జెప్పకుండ వర్ధాకు అయిదు మైళ్ళ దూర మున నున్న గ్రామమునకు వెళ్ళి యొక రైతు నింట నుండెను. అందఱు వెదకి వెదకి కనుఁగొనిరి. అచ్చటనే నివసింతునని వారికిఁ జెప్పి వేసెను. అదియె సేవాగ్రామము. ఆశ్రమమును స్థాపించినాఁడు. వివిధ మతముల వారు, వివిధ జాతుల వారు నందు నివసించుచుండిరి. ముఖ్యులు అబ్దుల్ గఫూర్ ఖాన్, అబ్దుల్ సలీం అను ముస్లిం స్త్రీ. మీరాబెన్ అను నాంగ్ల స్త్రీ భారతదేశపు వేషముతో నచ్చటనె యుండెను. రాజకుమారిఅమృతకౌర్(క్రైస్తవురాలు)పెద్దరాజకుటుంబము నుండి వచ్చినదైనను నిరాడంబరముగ గాంధి చెంతనె యుండెను. ప్యారీలాలు, సుశీలానాయర్ మొదలగు వా రందఱు చేరుకొనిరి. తన కాంత రంగిక కార్యదర్శిగ నున్న మహాదేవ దేశాయి కూడ నచటనె నివాసము. ఈయన సేవాగ్రాంలో చేరఁగనె ప్రభుత్వమువారు పోస్టాఫీసు, టెలి గ్రాం మొదలగు వాని నచట నేర్పాటు చేసిరి. దేశములోని పెద్దలందఱికిని నాలోచన చెప్పు మహాగురువుగ మహాత్ముఁ డచట నివసించుచుండెను.

ఆయన నిత్యకృతము చాల విచిత్రము. తెల్లవారు జామునసె నిద్రలేచువాఁడు. భారత దేశములో నన్ని మూలలనుండి వచ్చిన జాబులకు జవాబులు వ్రాయువాఁడు. ఒక గంట సేపు వాహ్యాళి. ఆయన వాహ్యాళికి వెళ్ళునపుడు స్త్రీ పురుషులు, బాల బాలికలు వెంట వచ్చుచుండిరి. ఆ తర్వాత నియతాహారమును స్వీకరించి యాశ్రమములో నున్న రోగులకు సేవ చేయును. రాట్నము వడికి నూలు తీయుట. వచ్చిన అతిథులతో సంభాషణ. సాయంత్రము మరల నొక గంట వాహ్యాళి. ప్రతిదినము ప్రార్థనలు జరుపును. ఆ ప్రార్థనలలో నందఱు పాల్గొనుచునే యుండిరి. కస్తూరిబాయికూడ శిష్యురాలే! పిల్లలను జూచిన గాంధికి చాల సంతోషము. కొందఱు మనుమలు, మనుమరాండ్రు నచ్చటనే నివాసము. వారితోఁ గొంతకాల మాటలాడుకొనువాఁడు. ఆయన ప్రార్థన సర్వమత ప్రధాన ప్రార్థనల కాలవాలము. ఒక మతముపై విశ్వాస మెక్కువ కాని, మఱియొక మతముపై తక్కువ కాని లేదు. సర్వమత సమభావము. అందుచే నా ప్రార్థన సర్వజనాంగీకార మగుటయె కాక, యొక మహోత్తమాదర్శమును లోకమునకుఁ జాటి చెప్పుచుండెను. సేవాగ్రామము జాతీయ, సాంఘికాధ్యాత్మిక తరంగములలో పవిత్రతను నోఁచుకొన్నది. అందుచే స్వదేశీయులకు, విదేశీయులకు యాత్రాస్థలమైనది. దేశభక్తికిఁ గేంద్ర స్థానమ్ము. బ్రిటిషు ప్రభుత్వము వారికి మృత్యుసదృశము. ఉడుకు నెత్తురుతోఁ బొంగులు వారు యువక కోటికి

జాతీయావేశమునకు దోహదము. భారత స్వాతంత్ర్యోద్య మమున కదియె కార్యాచరణ పీఠము.

1935 వ. సంవత్సరము భారతదేశ శాసనము క్రింద జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ దిగ్విజయమును బొందినది. 1937 సం. న పదునొకండు రాష్ట్రములకుగా నెనిమిది రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రి వర్గము లేర్పడి నవి. రాష్ట్రముల సామాన్య పరిపాలన సాగించు భారము కాంగ్రెసు సంస్థపైఁ బడినది.

కాంగ్రెసుసంస్థ యాశయముల కనుకూలముగఁ గొన్ని సంస్కరణములు రాష్ట్రములలో ప్రవేశపెట్టినవి మంత్రి వర్గములు. కాంగ్రెసు దేశపరిపాలనాదక్షమని బ్రిటిషు వారును. ప్రజలను గుర్తించిరి. ఇట్లుండ కాంగ్రెసుసంస్థలో రెండు ప్రత్యేకపక్షము లేర్పడినవి. కొందఱు చేఁజిక్కినట్టి యధికారమును స్వీకరించి, స్వాతంత్ర్యోద్యమమును నడుపు చుండవలెననిరి. సుభాస్‌చంద్రబోసు నాయకత్వముగల పక్ష మువా రదికూడదనియు, ప్రభుత్వముతో ప్రత్యక్షమైన పోరాటమునె సాగింపవలెననియు వాదించుచుండిరి. ఈ యిఱుపక్షములను జక్కదిద్ది మహాత్ముఁడె కాంగ్రెసు సంస్థ వ్యవహారములు చెడిపోకుండునట్లు కాపాడినాఁడు. ఆయనచివఱ కాసంస్థలో సభ్యుఁడుగూడ కాఁడు. కాకున్న ప్పటికి నావ్యక్తియందుఁగల గౌరవముచే నెవ్వ రేమనఁ జాలక, యాయన యుపదేశములను శిరసావహించుట పరిపాటి.

1939 వ. సంవత్సరమంలో రెండవ ప్రపంచమహా యుద్ధము ప్రారంభమాయెను. జపాన్, జర్మనీ మొదలగు నక్షరాజ్యకూటమి బ్రిటిషువారిపై యుద్ధము ప్రకటించెను. కొన్నివేలమైళ్ళలో జరుగుచున్న యుద్ధముతో భారతదేశమున కెట్టిసంబంధము లేకున్నను బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశముకూడ యుద్ధములోదిగినట్లు ప్రకటించిరి. ఆ ప్రకటన చేయుటకుముందు ప్రజాభిప్రాయమునుగాని, కనీసము ప్రజాసంస్థల యభిప్రాయమునుగాని బ్రిటిషుప్రభుత్వము స్వీకరింపలేదు. మరల భారతరాజకీయములు యథాప్రకారమాయెను. కాంగ్రెసుమంత్రివర్గము లన్నిరాష్ట్రములందు ప్రభుత్వమునుండి యుపసంహరించుకొనఁబడినవి. ప్రజలలో సామూహిక ప్రభుత్వవ్యతిరేకతకు పునాదులువేయఁబడెను. బ్రిటిషుప్రభుత్వపు నిరంకుశ పరిపాలనా పిశాచము వేయినాలుకలతో తలెత్తెను.

3

అంతకు కొద్దికాలముముందె మహాత్ముఁడు జన్మస్థానమైన రాజకోటసంస్థానమునకు వెళ్ళి యుపవాసదీక్ష చేయవలసివచ్చెను. రాజకోటసంస్థానపు రాజు ముందు ప్రజలకిచ్చిన వాగ్దానమును వదలిపెట్టినాఁడు. ఆ పవిత్రమైన వాగ్దానమును జెల్లింపవలసినదని గాంధిజీ ఆ జాను ప్రార్థించెను. అందుల కాయన సమ్మతింపలేదు. తనకు సహజమైన యుపవాసదీక్షాస్త్రమునె ప్రయోగింపక తప్పినదికాదు. ఆ యస్త్రమున కెచ్చటికిపోయినను నైతికవిజయమే! రా జెంత

వఱకు లొంగలేదు. దేశమంతయు గాంధి యుపవాసదీక్షను విని యట్టుడికి నట్టుడికిపోయెను. రాజప్రతినిధియే స్వయముగఁ జేయికలుగచేసికొనక తప్పదాయె. రాజు నిష్టముతో భారతప్రధానన్యాయమూర్తి మధ్యవర్తిత్వమున కాసమస్య వదలిపెట్టఁబడెను. అయిదవనాఁ డుపవాసదీక్షను మహాత్ముఁడు వదలిపెట్టినాఁడు.

కాంగ్రెసు వ్యష్టిసత్యాగ్రహమును ప్రారంభించినది. ఆనాఁటికి ముందువఱకు మంత్రులుగనుండి, గొప్పయధికారమును రుచిచూచిన కాంగ్రెసునాయకులు దేశస్వాతంత్ర్యముకొఱకు కృష్ణజన్మస్థానముల నలంకరించుట కత్యుత్సాహముతో ముందునకువచ్చిరి. క్రమబద్ధమైన విధానముతో మహాత్ముఁడు సత్యాగ్రహసమరమును వెలుపలనుండియె సాగించుచున్నాఁడు. మొదటి ప్రపంచమహాసంగ్రామమప్పుడు బ్రిటిషుప్రభుత్వమునకు సహాయము చేయవలెనని భారతీయుల కుద్బోధించినట్టి మహాత్ముఁడే నేఁ డవసరములేదనెను. కారాగారములన్నియు దేశభక్తులతో నిండిపోయినవి.

కాలము జరుగఁగొలది సంధికి—సహకారమునకు భిన్నముగ మార్పులు వచ్చినవి, దారుణముగ జాతీయ శక్తులణఁచి వేయఁబడుచుండెను. గాలిలో మరల సామూహిక ప్రజావ్యతిరేక చిహ్నములు పొడగట్టినవి. ప్రజలను బట్టపగ్గములు లేకుండెను. యుద్ధముచే నంతర్జాతీయ రాజకీయ రంగము మహాకల్లోలము. జాతీయ జీవనరంగము బ్రిటిషు ప్రభుత్వోద్యోగుల దారుణప్రవర్తనముతో సంక్షుభితమైనది.

ఇట్టి దుర్భర పరిస్థితులలో నలమటించు ప్రజానీకమునకు దారి చూపు వా రెవరు? మహాత్ముఁడే! దాస్యభారత జాతి కాయన యె యుద్ధారకుఁడు, మహావిపత్సముద్రమునుండి భారతీయులఁ దరింపఁ జేయగల కర్ణధారి.

1942 వ: సంవత్సరము ఆగస్టు నెలలో బొంబాయి పట్టణమున భారత జాతీయ మహాసభ జరిగెను. మహాత్ముఁడే నాయకత్వమును వహించి "భారతదేశమునుండి వైదొలఁగుఁడు" అను ("Quit India") నినాదమును సభలో ప్రతిధ్వనింపఁ జేసెను. ఆ సేతు శీతాచల పర్యంత భారత భూభాగమునుండి సమావేశమునకు ప్రతినిధులుగఁ గొన్ని వేలమంది కాంగ్రెసు వాదు లేతెంచిరి. ప్రేక్షకులుగ వచ్చిన జనమున కింత యంత యని లెక్క చెప్పుటకే వీలు కాదు. ఆ సమావేశస్థలములో నాసీనులైన వారి కంఠను లొక్క మాఱు గాంధిగారు పలికిన "భారతదేశమునుండి వైదొలఁగుఁ" డను నినాదము చేసిరి. ఢిల్లీలో నున్న రాజ ప్రతినిధి యా సభావిశేషముల నెప్పటి కప్పుడు తెలిసికొను చున్నాఁడు. బొంబాయి పట్టణమంతయును సభకువచ్చినలక్షల జనమునకు మించిన పోలీసు, సైనికులచేఁ గ్రిక్కిరిసిపోయెను. కాంగ్రెసుమహాసభ సాముూహిక వ్యతిరేకతకనుసరింపవలసిన విధానములు చర్చించుటకు మఱునాఁటికివాయిదా పడెను.

బ్రిటిషుప్రభుత్వము నాయకుల నిర్బంధింప నుత్తర వులఁ దిజంపెను. నాయకు లందఱు ఆగస్టు 8-వ. తే (1942 సం.) రాత్రియెవరి విడిదులలో వారు విశ్రమించి

యుండ పోలీసు అధికారులు వెళ్ళి నిర్బంధించి, తెల్లవారు లోపుగ బొంబాయి పట్టణమునుండి యెచ్చటికో తీసికొని పోయిరి. ఉదయమునిద్ర లేచు సరికి యీ వార్త పట్టణమునం దంతయుఁ దెలిసిపోయెను. మహాత్ముఁడు తన ప్రార్థన గ్రంథములు తీసికొని పోలీసులు తెచ్చిన కారులో చిఱునగవుతో నెక్కెనఁట! ఆ స్థితప్రజ్ఞునకు, దేశసేవా పరాయణ మతికి కృష్ణజన్మస్థానమన్న బెంగ యేటికి కలుగును?

చుక్కాని, కర్ణధారి లేని యోడప్రయాణము వంటి దయ్యె నా జనసముదాయము. మంచిచెడ్డలు చెప్పువారు లేరు. బ్రిటిషుప్రభుత్వమును క్షణములలో నుసిచేయవలెనను నా నేశ మందఱిలో మూర్తీభవించెను. కర్తవ్య మొక్క రికిఁదెలియదు. అంతకు ముందుదినము మహాత్ముఁ డుపన్య సించు చున్నట్టి "యశోవా మృత్యుర్వా" అను సూత్రము నందఱు పఠించిరి. విధ్వంసకచర్యలు మొట్టమొదట బొంబా యిలో ప్రారంభమాయెను. దేశము నలుమూలలనుండి వచ్చిన జనులు పై సూత్రమును స్మృతిపథములో భద్రముగ నుంచుకొని యెవరిగ్రామములకు వారు వెళ్ళిరి. అందమైన బొంబాయిపట్టణము కొన్నిగంటలలో వికృతరూపమును బొందెను. టెలిగ్రాం, టెలిఫోనుస్థంభములు పెఱికి వేయఁ బడినవి. ప్రభుత్వకార్యాలయములు తగులఁబెట్టుట. మొద లగు ఘోరకార్యము లెన్నేనియు జరిగినవి. ఎవరిలోఁ జూచినను క్రోధము, ప్రతిఘటన, శత్రుచర్యలే ప్రత్యక్ష ములు. ప్రభుత్వము నెరపిన హింసాకాండలో నెందఱోయువ

కులు, స్త్రీలు స్వాతంత్ర్యసమరములో పోరి, దమననీతి కాహుతియైనవారిలోఁ గలిసిపోయిరి. బొంబాయి చరిత్ర పలుప్రదేశముల పునరావృత్తి మొనర్పఁబడెను. ప్రజ లెట్లు విచ్చలవిడిగ నరాజకచర్యలు చేయుచున్నారో, ప్రభుత్వో ద్యోగులు నంతకుమించి దండనపద్ధతు లవలంబింపసాగిరి. అదియొక మహాప్రళయము. దానికార్యక్రమ మదిజరుపు కొనక నడ్డగింప సాధ్యమా ?

సర్ స్టాఫర్డుక్రిప్సు రాయబారములు వృథాయయి నవి. జాతీయోద్యమము పైకికనుపించక, లోలోన ప్రబలు చునేయుండెను. అట్టిపరిస్థితులలో మహాత్మున కివి చాల దారుణముగనుండెను. గోరుచుట్టపై రోఁకటిపోటన్నట్లు మహాదేవదేశాయి ఆగాఖాన్ భవనము (చెఱసాల)లో నుండఁగనె మరణించెను. రెండు సంవత్సరములైనను గడు వకముందె సహచారిణి, నిష్కళంక దేశభక్తురాలు క్షమా శీలయగు కస్తూరిబాయి శాశ్వతముగ కన్నులుమూసెను. ఈ రెండుమరణములు నాయునహృదయముపై నేమాత్రము దుఃఖముద్రవైవఁ జాలకపోయినవి. స్థితప్రజ్ఞుఁడనుట కిదియొ నిదర్శనము. దేశప్రజల దుర్భరస్థితికి, ప్రభుత్వపు నిరంకుశ విధానాలకు వగచినాఁడు. తన కేమిచేయుటకు తోఁచినది కాదు. "భగవంతునకు ప్రార్థనగ" చెఱసాలయందె యుప వాసదీక్షకుఁ బూనుకొనెను. ఇఱువదియొక్క దినములు సాగి నది. వైద్యకారణములతో 6-5-1944 వ. తేదిన ప్రభుత్వ ముచే విడుదలచేయఁబడినాఁడు.

ప్రార్థనలు జరిపి, తండోపతండములుగ వచ్చు జనులకు సత్యము, శాంతము, అహింసల ప్రభావముతోఁ బాటు రాజకీయములను బోధించుటకు మొదలు పెట్టెను. హిందు-ముస్లిముల విభేదసమస్య మహాత్ముని యెక్కువ కలవర పఱచెను. అందులకై యవిరళకృషి చేసి, ముస్లింసభకు నాయకుఁడైనా జిన్నాను కలిసికొని సంప్రతించెను. సంప్రతింపులు భగ్నమైనవి. నిరాశ యాయన జీవితములో నెన్నఁడును లేదు. తాను సత్య మనుకొన్న దానికై ప్రచారమును జేయుచునె యుండెను. ప్రభుత్వముతో నుత్తర ప్రత్యుత్తరములు జరిపినాఁడు. భారత స్వాతంత్ర్య సమస్య తేలునట్లు తోఁచలేదు. యూరపు ఖండములో యుద్ధము ముగిసి పోయినది. నాయకు లందఱు చెఱసాలలనుండి వదలివేయఁబడిరి. మరల కాంగ్రెసు సంస్థ పునరుజ్జీవ మొందెను.

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామము ముగిసినది. లార్డు వేవెల్ భారతరాజ ప్రతినిధి యయ్యెను. ఇంగ్లండులో ఎన్నికలు జరిగినవి. 'లేబరు పార్టి' ప్రభుత్వ మేర్పడెను. అంతకు ముందె మహాత్ముఁడు దక్షిణ భారత హిందూస్తాని ప్రచార సభ రజతోత్సవమునకై మద్రాసుకు వచ్చెను. దక్షిణ దేశవాసుల కాయన ప్రార్థనోపన్యాసములు విను భాగ్యము కలిగినది. దేశములోఁ గొన్ని మూలల క్షామము-సైనిక దళములోను దేశభక్తి పెచ్చు పెఱిగినది. బ్రిటిషు ప్రభుత్వ మింక భారత దేశము నేల లేమను సంగతి తెలిసికొనెను, వెంటనే భారత దేశములో విద్యావంతు లందఱికి

నీయఁబడిన వోటుతో నెన్నికలు జరిగినవి. సాధారణ నియోజక వర్గములలో కాంగ్రెసు, ముస్లిముల ప్రత్యేక నియోజక వర్గములలో ముస్లిం సభ యఖండవిజయమును బొందినవి. భారత ప్రధాన రాజకీయ సంస్థలతో రాయ బారముల నిమిత్తమై బ్రిటిషు మంత్రి మండలి భారత దేశ మున కేతెంచెను. రాయబారములు ఫలప్రద మైనవి. 1948-వ సం. జూన్ నెలలో స్వతంత్ర మొసంగుదు మని బ్రిటిషు ప్రభుత్వము ప్రకటించెను.

విభేదములతోను, దూరదృష్టి రహితము గను కేంద్రమునం దేర్పడిన కాంగ్రెసు— ముస్లిం లీగు సంయుక్త ప్రభుత్వము సరిగ పనిచేయఁ జాలకపోయెను. ముస్లిం లీగు "ప్రత్యక్షచర్య" కుఁగడఁగెను. దానితో నంతవఱకు నణఁగి యున్న మతకలహము లొక్కుమ్మడి దేశమందంతయు ప్రజ్వ గిల్లినవి. కలకత్తా హత్యలకు, నవఖాలీ, బీహారు ప్రాంతములో జరిగిన దారుణ హింసా కాండకు దారి తీసెను. దేశమంతయు నీ యకాల విరోధ ఝంఝూవాతముతో సంక్షుభితమై పోయెను. కరుణార సార్ద్ర హృదయుఁడైన మహాత్ముఁ డెట్లు సహింపఁ గలఁడు ?

మహాత్ముని దీక్షాఫలితముగ, నాయనకు ప్రజలలోఁ గల పలుకుబడి కారణముగ నీ మతకలహము లప్పటికప్పుడె కొంతకుఁగొంత శాంతింపఁగలిగినవి. లేకున్న భారత దేశ మంతయు పీనుఁగులపెంట కావలసినదికదా ! కలకత్తాకు వెళ్ళినాఁడు. నవఖాళీ, త్రిపుర మొదలగుమండలముల నన్నిం

టిని కాలినడకతో సంచరించి, ముస్లిములలో హిందువుల యెడ సోదరభావమును గలిగించెను. ముస్లిముల మసీదుల చెంతనె ప్రార్థనజరిపి యుపన్యాసముల నొసఁగువాఁడు. వారింటనేదిగి, మతసమానమని బోధించుచు పర్యటించెను. ఎటులైననేమి పరిస్థితులు కొంతవఱకు శాంతించినవి.

బ్రిటిషుప్రభుత్వము భారతసైనికదళములలో ప్రబలుచున్న దేశభక్తికి, నంతర్జాతీయరంగములో నేర్పడిన యొత్తిడికి, భారతరాజకీయసంస్థల ప్రతిఘటనకు వెఱఁగంది స్వతంత్రప్రదానమునకు సిద్ధమయి రేకాని వేఱొండుకాదని విస్పష్టము. ముస్లింలీగు నడ్డుపెట్టి దేశమును రెండుగ హిందుస్తానము-పాకిస్తానములని విభజింపఁ దలఁపెట్టి, బ్రిటీషు ప్రభుత్వము కృతార్థతనందెను. దేశవిభజన మహానర్థదాయకముగా మహాత్ముఁడు గుర్తించినాఁడు. ఆత్మపరిశీలనము చేసికొనెను. విదేశప్రభుత్వము ముందుతొలఁగిపోయిన మనసమస్యల నెట్లయిన పరిశీలించుకొనవచ్చునని భావించి, దేశవిభజనకు సమ్మతించినాఁడు. రెండువర్గములమధ్య సంధి కుదురఁగలదని యూహ.

1947 సం. ఆగస్టు 15 వ. తేది భారతదేశము స్వతంత్రమైనది. పాకిస్తాను పుట్టుకవచ్చినది. దేశమందంతయు స్వాతంత్రోత్సవములు జరుగుచు, ప్రజలానందసముద్రములో మునిఁగి తేలుచున్నను, గాంధి కట్టియానంద లవలేశముకూడ కలుగలేదు. దేశము విభజింపఁబడుటయె యందులకుఁ గారణము.

పంజాబు జనహత్యాకాండ మహాత్ముని చెవులఁ బడెను. గుండె నీరైనది. చాల బాధపడినాఁడు. ఎన్నఁడు లేని మతావేశమును దేశములో నధికాధిక మొనర్చినట్టి స్వాతంత్ర్యము రాకున్నప్పటికిని దేశమునకె క్షేమముగ నుండెడిదని యొప్పుకొనెను. పూర్వపద్ధతిప్రకారమె యితరులుచేసిన తప్పులకు తన్నుతానె శిక్షించుకొను నుపవాస దీక్షలకుఁ బూనుకొనెను. మొదట కలకత్తాలో నుపవాసము చేసినాఁడు. ఉభయపక్షముల నాయకులు శాంతిని ప్రతిష్ఠింతు మని వాగ్దాన మొసఁగ విరమించెను. తరువాత ఢిల్లీలో కాలపరిమితిలేని యుపవాసదీక్షను మతైక్యతకై ప్రారంభించినాఁడు. అనేకకులములకు, మతములకు సంబంధించిన 130 మంది పెద్దలు సంతకముచేసి మతసామరస్యమునకుఁ గృషిచేయుదుమని శపథముచేయ నాదీక్ష నాఱుదినములకు విరమించుకొనెను.

౪

దేశస్వాతంత్ర్య మాయనకేమాత్రముఁదృప్తికలిగింప లేదు. మతములమధ్య, కులములమధ్య నైక్యతలభించి నప్పుడె యీస్వాతంత్ర్య మర్థవంతమని తలఁచినాఁడు. ప్రతి దినము సాయంత్రమువేళ ప్రార్థనసమావేశములు జరుగ సాగినవి. వానిలో మతపుపిచ్చి కూడదనియు, సన్నిమత ములవారిని కులములవారిని సమానముగనె గౌరవింపవలయు ననియు, ముస్లిము లెచ్చటనో తమసోదరులపై దౌర్జన్యము చేసి రన్నంతమాత్రమున, నిచటఁగల యమాయకులైన

ముస్లిములను హింసింపఁగూడదనియుఁ బోధించుచుండెను. పిచ్చియుద్రేకముతోనున్న యువకుల కీయుపదేశము లేమాత్రము నచ్చలేదు. ఆయనఁ జంపుట కొకకుట్రపన్నిరి. ముస్లిములు తమ ధనమానప్రాణములను రక్షింపఁ బూనుకొన్న మహాత్మునిపై యధికానురాగము గలిగియుండిరి.

ఆ యుడుకులో, నాసంక్షుభిత వాతావరణములో హిందువులకు గాంధిబోధన లంతగ నాకర్షింపలేకపోయెను. మహారాష్ట్రమునకుఁ జెందిన యొకయువకుఁడు సాహసమునకుఁ గడఁగినాఁడు. బిర్లాభవనములో ననుదినము సాయంత్రము ప్రార్థనప్రదేశమునకు వెళ్ళునట్లుగ నాశతవృద్ధు, అహింసామూర్తి, సకలమానవకళ్యాణప్రబోధి, మహాత్ముఁడు మనుమరాండ్రిఋప్రక్కల నూఁతగ వెంటరాగా బయలుదేఱెను. ఆ యువకుని గుండెనిబ్బఱ మనన్యము. ప్రపంచమంతయు నే మహాపురుషుని గుణగానము చేయుచున్నదో, యెవనిబోధనలు పతితమానవజాతినే తరింపఁజేయఁగలవో అట్టిమహాత్ముని వక్షస్థలమునకు సూటిగా మూఁడు పిస్టల్ గుండ్లు వదలఁబడినవి. ఆ మహామహుఁడు రామనామ ముచ్చరించుచు నీ భౌతికయాత్ర చాలించెను.

భారతదేశమంత నొక్కమాఱు ఘొల్లుమన్నది. ప్రపంచము దుఃఖసముద్రములో మునిఁగిపోయెను. స్వాతంత్ర్యమును సంపాదించిపెట్టిన మహాత్ముని యింతత్వరలో భారతదేశము గోల్పోవునని యెవరును కలలోనైనఁ దలపలేదు.

భారతదేశములో నన్ని రాష్ట్రములనుండి నాయకులు మఱునాఁడు ఢిల్లీకి చేరుకొనిరి. మహాత్మాగాంధి యంత్య దర్శనమునకై లక్షలజనము విఱుగఁబడి బిర్లాభవనము చుట్టును చేరెను. నాఁడు తమ జాతీయపిత ఋణమును దీర్చుకొనుటకై భారతప్రజ లుపవాసములు చేసి శవదహన సమయములో స్నానాదులొనర్చిరి. రాజమర్యాదలతో నాయనవదలిపెట్టిన భౌతికదేహము నుత్సవముతో ఢిల్లీ పురవీథులగుండఁ దీసికొనిపోయి యమునాతీరమందు రాజ ఘాటులో దహనసంస్కారాదులు గావింపఁబడెను. రాజ మర్యాదలు, విమానముతో పుష్పవర్షము నా దేహమునకు సమకూరినవి. గీతాపారాయణము, 'రామధున్ గానము' కొనసాగెను. ప్రభుత్వకార్యాలయములన్నియు మూయఁ బడినవి. జాతీయపతాకము నర్ధమునకు దించి, సంతాపము వ్యక్తీకరించిరి. నాఁటితో భారతాంబరమునుండి యొక జాజ్వల్యమానమైన తార రాలిపోయినది. ప్రజలన్నివిభేద ములను మఱచి, మహాత్మునియాత్మకు శాంతిలభింపఁ జేయ వలసినదిగా తమతమ దేవుళ్ళను ప్రార్థించిరి.

ప్రపంచములోఁ గల యన్ని దేశముల ప్రభుత్వములు నధికార పూర్వకముగ మహాత్మాగాంధి మరణమునకు సంతాపము వెలిబుచ్చుచు, నాయా జాతీయపతాకముల నర్ధమునకు దించి బాష్పాంజలులు సమర్పించినవి. ఒకటి రెండు రోజులలో సర్వాంసహాచక్రమందు మహానగరము

మొదలు పట్టణములలో, గ్రామటికలలో నీ మరణవార్త తెలిసిపోయెను. విన్న వా రెవరైనను గన్నీటిచుక్కలను రాల్చి మహాత్ముని యెడ(గల యనురాగమును బ్రదర్శించి వగచిరి. ప్రపంచా శాజ్యోతి చల్లారి పోయెనని మేధావులు, రాజకీయజ్ఞులు వ్యాఖ్యానించిరి. నిజముగ నాశాజ్యోతియె. దారుణ మారణాయుధముల( బ్రపంచ వ్యవస్థనె యస్త వ్యస్తము చేయ నుంకించు నీ యుగప్రభావము నడ్డుకొన( గల శక్తి యేది? అట్టి శక్తి యొక మహాత్మునిలో( బ్రతీత మైనది. అహింసా శక్తితో నడ్డుకొని ప్రపంచ వ్యవస్థను జక్క(బఱచునని కొందఱు పెట్టుకొన్న యాశ లడుగంటినవి.

మహాత్ముని ఋణము( దీర్చుకొనవలెనన్న ఆయన సిద్ధాంతములను జాతిలో నణ(గి పోకుండునట్లు చేసి, వాని మూలమున నేటి విధ్వంసాత్మక ప్రపంచము నుద్ధరించిన నా(డె యది సాధ్యమగును.

అక్బరు మరణానంతరము నిట్టి మహామహు(డు మన దేశము గడ్డపై నుద్భవింప లేదు. అందులకే "మహా ప్రఖ్యాతు(డు, మహిమా సంపన్నమైన వాక్కు కలవా(డ"ని పొగడ్త లందినా(డు. మన మెంత వెనుకకు( బోయి చరిత్రను బరిశీలించిన నిట్టి యుత్తమ వ్యక్తు లింక నిరువుర కంటె నెక్కువగ లేరు. వారే బుద్ధు(డు—అశోకు(డు. ప్రపంచ జాతులలో మనలను రెండు విధములుగ గొప్ప వారమని ప్రదర్శించినా(డు. రవి యస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యము నెదురించుట—నూతన నాగరికతను నిర్మించి, క్రొత్త విధ-

మైన సాంఘిక తత్త్వము ప్రబోధింపఁ జేయుట. భారత దేశ మున కీయన చేసిన సేవ యనన్యము. రక్తపాతరహితముగ ప్రభుత్వములను మార్పఁగలమా? దోపిడి నుండి, నిరాశ నుండి ప్రజలను రక్షింపఁ గలమా? అను ప్రశ్నల కెంత కాలమునుండియో పలువురు సమాధానము లొసఁగఁ బ్రయ త్నించియు కృతకృత్యులు గాలేక పోయిరి. కృతకృత్యుఁ డైనది మహాత్మాగాంధి యొకఁడే!

ఆయన గుణగానము చేయుచు, నాయన సిద్ధాంతముల నవగాహనము చేసికొని, మహాత్ముని యడుగు జాడలలో నడచిననాఁడె, భారత దేశ కళ్యాణమె కాక—ప్రపంచ కళ్యాణము కూడ సమకూరును. అట్టి కార్యక్రమమున కెల్లరు బ్రతిజ్ఞఁ గైకొందురు గాక!

జై హింద్!

# MAHATHMUDU

TELUGU NON-DETAIL

BY

D. V. SUBBA SASTRY

BALASARASWATHI BOOK DEPOT

KURNOOL :: MADRAS

Price Re. 1